# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య



## ANDHRA RASTRA PRARAMBHA VIDYA


విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] [సంచిక 9

**15 డిశంబరు 1952**







సంపాదకులు :

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు బి.ఎ.

వ్యవస్థాపకులు :

శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

# విషయసూచిక







# ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] ఏలూరు, డిశంబరు 15 [సంచిక 9





వివరణము :

అరువు తెచ్చుకొనినజ్ఞానము మారిపోవుచుండును. దానిని మన మనుభవమునకు దెచ్చుకొనవలెను. నేర్చుకొనుటకుఇతరులచెంత కేగుచో నది మనదికాజాలదు. మనకు సహజముగ లభించునదే యథార్థజ్ఞానము. అదిచేతిలోనిదీపమువలె నుపయోగపడు చుండును; అన్నివస్తువులనుజూపించును. ఇదియే వివేకము.

సంకీర్తనము :

హే జ్ఞానానందమయా ! నీనిజరూపమును గ్రహించుయోగ్యతనిమ్ము.
నేను నిరంతరము ఆత్మానుసంధాన మొనర్తునుగాక !
నాచిత్తమును, హృదయమును, బవిత్రముగ నుండును గాక !
నాదృష్టి అంతర్వర్తియై శాంత్యానందముల ననుభవించును గాక !

స్వామిరామతీర్థ

## బాలగేయము-భూగోళము

(ఘుమఘుమల్లునరా అనువరుస)

మది నెంచుమిరా... ...
మది నెంచుమిరా—యీ భూమికి మధ్యము
గనరా ఒకయిరుసు ఉత్తర దక్షిణముల
గలదనుకోరా॥
అద్దాని యుత్తరపుచివ రుత్తరధ్రువమూ
దాని దక్షిణపుకొనయే దక్షిణధ్రువమూ
ఇక భూమిని దక్షిణోత్తర సమభాగములవగా
విభజించు రేఖ భూమధ్యము గలదనుకోరా
ఆ రేఖయె భూమధ్యరేఖ నాడీరేఖా
దానుత్తరపుసగమూ—ఉత్తరార్ధగోళము
మరి దక్షిణార్ధగోళముగా—దక్షిణపుసగమూ
గదరా—యిక సీ॥ మది॥

పక్కి—అప్పారావు పటనాయక్.

## కాలములు-గేయము

శ్రీ బందలుప్పి ధర్మారావు—టీచరు మేనేజరు

1. వసంత ఋతువును కనవోయ్!
పక్షులకూతలు వినవోయ్!
మల్లెపువ్వుల సమయంబోయ్!
పిల్లల కానందంబోయ్!
2. వేసవికాలము వచ్చిందోయ్!
విసనకఱ్ఱలను విప్పెదరోయ్
ఎండలో తిరుగక మామిడిపండ్లను
ఇంపుగ తినుమోయ్!
3. వానకాలము వచ్చిందోయ్!
రైతులకిదె సమయంబోయ్
వర్షములోను తడవకుండగ
గొడుగును కొనిపోవోయ్!
4. చలికాలము వచ్చిందోయ్
కొత్తరగ్గులను తెప్పించోయ్
ముసలమ్మల దరిచేరి
మంచికథలు వినుమోయ్!

---



# నయీ తాలిమీ సంఘము

మూలం : శ్రీమతి సరళాదేవి

అనుసరణ : శ్రీ శీలా వెంకటప్ప టీచరు; కమలాపురం

[వెనుకటి సంచికలో నేటివిద్యావిధానం యేవిధంగా మన ప్రాచీన సంస్కృతిని, ప్రాభవాన్ని, రూపుమాపి నిరుద్యోగాన్ని, అసంతృప్తిని, కలుగజేసింది సహేతుకంగా శ్రీమతి సరళాదేవి వివరించింది. ఇప్పుడు ఈ వ్యాసములో గాంధీజీ ఆశీస్సు పొందిన బేసిక్ విద్యావిధానంవలన మన గ్రామీణ వృత్తులు స్వయంసంపూర్ణం అవుతాయని, మన గ్రామాలు సంస్కృతి కేంద్రాలుగా సర్వతోముఖాభివృద్ధిగా వర్ధిల్లుతాయని, అంతేగాకుండా ఆర్థికంగా సాంఘికంగా, రాజకీయంగాకూడ మనదేశం పురోభివృద్ధి గాంచుతుందని, గాంధీజీ ఆశించి యుండినట్లు ఈ రచయిత్రి వివరిస్తున్నది. ఇక చదువండి.]

ప్రథమములో గాంధీజీ దక్షిణాఫ్రికాలో తన న్యాయవాదవృత్తిని పరిత్యజించి, విప్లవాత్మకమైన జీవితాన్ని ప్రారంభించారు. అక్కడ స్వతహాగా జీవించేందుకు ఒక వ్యవసాయ సంబంధమైన ఆశ్రమాన్ని నిర్మించుకొన్నారు. ఇక్కడనే తనకు, తన సహచరులకు, "విద్యావిధానం యేవిధంగా పరిష్కరించవలెను ? అనే సమస్య బయలుదేరింది. అందులో ప్రాథమికవిద్య మరీక్లిష్టమైనది. సాధుత్వము, సహజత్వము, ఉదారత్వం, మున్నగు గుణములు గలిగిన గాంధీజీ బిడ్డలకు విద్యాబోధన చేయుటలో స్వతస్సిద్ధమైన బోధకుడుగా BORN TEACHER తయారైనారు.

అక్కడ తన ఆశ్రమములో బిడ్డలను రోజు నాలుగు గంటలపాటు విద్యానిమగ్నులుగా చేసి, మిగతా కాలం క్రియాత్మకమైన పనులకు వినియోగిస్తూ వుండినారు. ఈ సిద్ధాంతాలనే మనదేశమందుగల జాతీయ విద్యాసంస్థలందు తనప్రభావము చేత అమలు జరిపించినారు. బాపూజీ సిద్ధాంతాలచే నెలకొల్పబడిన విద్యాలయాలలోని విద్యార్థులే సామాన్య జ్ఞానములోను, స్వీయాభిప్రాయాల్ని ప్రకటించడములోను, మాతృదేశ భక్తిలోను, పురోగాములుగా వున్నారు.

1937 సం. లో కాంగ్రెస్ అధికార స్వీకారం చేయకముందు మనం సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా కూడ పురోభివృద్ధి గాంచవలెనని గాంధీజీ ఆశించి యుండినారు. కాని ఆ ఆశయం నెరవేరలేదు. కాంగ్రెస్ అధికార స్వీకారణానంతరము మనజాతి పిత గాంధీజీకి మనవిద్యను జాతీయ విద్యగా చేయవలెననెడి అభిప్రాయం కలిగింది. విద్యావిషయమై తన అభిప్రాయాల్ని క్రోడీకరిస్తూ క్రిందినాలుగు బేసిక్ సూత్రాలను స్థిరీకరించారు.

(1) 7 సంవత్సరముల పాటు జాతీయవిద్య అందరికీ ఉచితనిర్బంధవిద్య కలిగించాలి.

(2) అన్నిపాఠాలు మాతృభాషలో బోధించాలి.

(3) సాధ్యమైనంతవరకు పరిసరములలోని వృత్తుల ననుసరించి, ప్రారంభవిద్యను అభ్యసించునట్లు కేంద్రీకరించుట.

(4) ఈవృత్తి విద్యావిధానములో ఉపాధ్యాయులను కూడ తర్బీతు చేయాలి.

## వృత్తిపనుల ప్రాముఖ్యం

చాలమంది వృత్తిపనులను గాంధీ సమర్థించే సందర్భములో వృత్తిపనుల మంచిచెడ్డలను పరిగ్రహించినందున, విద్యావేత్తలు వీటికి అధిక ప్రాధాన్యాన్ని యిచ్చారు. అందుచేత దీన్ని ఘనీభవిస్తున ప్రచారం చేయవలసిన అవసరం గాని, దీనివిషయమై

తర్జనభర్జనలుగాని, అనవసరం గత శతాబ్దం చివరి దశలో వృత్తివిద్య ప్రత్యేకంగా ప్రముఖస్థానాన్ని పాఠ్యప్రణాళికలో ఆక్రమించుకొనకపోయినా తన స్థానాన్ని మాత్రం నిలబెట్టుకొంది. అయితే పాశ్చాత్యదేశాల్లో మాత్రం ప్రశస్తమైన స్థానాన్ని ఆక్రమించుకొంది. అమెరికాలో "డ్యూయీ" ప్రముఖునిచే కనిపెట్టబడిన "డ్యూయీ మెథడ్" ప్రపంచమంతటా ప్రశస్తి పొందింది. అందుకు కారణం దాని విశిష్టతయే. ఉత్పత్తివిధానానికి, గ్రామసౌభాగ్యానికి, ప్రయోగాత్మకానికి, మన మాదిరి వృత్తివిద్యావిధానం మూలాధారమని పాశ్చాత్యదేశాల్లో ఇప్పటికీ విద్యావేత్తలచేత తృణీకరించబడలేదు. మనదేశమంతటా ఈ విద్యావిధానంతో ప్రాథమికవిద్యను నిర్బంధము చేయవలెను. ఆర్థికదుస్థితిచే మేధావంతులైన పలువురు నేడు తగిన అవకాశాలు లేక వున్నారు. ఇప్పుడు వారికి కూడ తగిన అవకాశాల నిచ్చి అభివృద్ధిలోనికి తేవలసిన సమస్య ముఖ్యమైనదిగా యున్నది.

## సాంఘిక సమస్య

స్వాతంత్ర్యసిద్ధితర్వాత సాంఘిక సమస్య ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకుంది. సంఘములో కష్టజీవులు తమ శక్తిని ధారపోస్తూ శారీరకంగా, మానసికంగా, మూఢులై పతనమై పోతున్నారు. అంటే కష్టం చేసేది శ్రమజీవులు, ఫలమనుభవించేదిమరొకరు. నేడిది దేశానికి చాలా ప్రమాదకరం నేటి మన సంఘవ్యవస్థను ఆర్థికంగా, సాంఘికంగా, సంస్కరించవలెనంటే ఈ తారతమ్యాన్ని నిర్మూలించేందుకు వంతెనగా "వృత్తి"ని కేంద్రముగా తీసుకొని, మన విద్యావిధానాన్ని రూపొందించుకోవలెను.

మన సత్వశాస్త్రాని సారంగా బిడ్డల విద్యాభివృద్ధిని కాంక్షించే వారందరు విద్యాసమస్యను మూఢత్వంతో నిర్లక్ష్యంచేయరు. బిడ్డల ప్రారంభదశలో విద్య ప్రయోగాత్మక మైనదిగా (Prac-tical) వుండాలి. గ్రహించేశక్తి వచ్చిన తర్వాత ఈవిద్య చాలా ఉపయోగకరంగా వుంటుంది. ఎందుకు మనము సృజనాత్మకము, అనుభవ పూర్వకము, ప్రయోగాత్మకమైన విద్యను ఆచరణలో వుంచాలి? దీనికి కారణం పరిశోధ నాలయములో వివిధవిషయాలను మనం యేమాదిరిగా పరిశోధిస్తామో, ఆ మాదిరిగానే పైవిద్యా విధానములో సహజత్వము, సృజనాత్మకం, ధారణ, కార్యాచరణ శక్తి, స్వతస్సిద్ధంగాకలిగించేందుకు చాలాఅవకాశాలున్నాయి. అంతేగాకుండా చిన్నవాటినుండి పెద్దవాటిని ప్రారంభించేందుకు అనుభవముకూడ కలుగుచున్నది.

## శరీర వ్యాయామము

ఇకశరీర వ్యాయామాన్ని గూర్చి ఆలోచిస్తే యే తిరుగలిలోనో, చేతియంత్రములోనో, మన శరీరములోని అవయవములను అభ్యాసంయిస్తూపనిచేస్తే శరీర వ్యాయామానికి అవకాశాన్ని కలిగించడమే కాక మనఉత్పత్తి శక్తికూడ అధికమౌతుంది. విద్యావంతుల అంచనా ప్రకారం నేటి కృత్రిమ వ్యాయామశిక్షణ మంచిదే అయినా తగిన అభ్యాసం యివ్వడంలేదు. దీనికన్న ఉత్పత్తిశక్తితో కూడుకొన్న వ్యాయామ శిక్షణ మంచిదిగదా! ఈ మిశ్రమ శిక్షణలో ఆరితేరిన బిడ్డలు సృజనాత్మక శక్తితో జీవితములో ఆత్మసంతృప్తితో పాటు కార్యాచరణ శక్తిని కూడ పొందుచున్నారు.

ఇదేవిధంగా మనం మాంటిసోరి, లేదా నర్సరీ స్కూల్లోని శిక్షణపొందుచున్న ఒకబిడ్డను పరిశీలిస్తే యేవిధంగా బాధ్యత, నిర్ధారణ, శ్రద్ధ, కుతూహలముతో సృజనాత్మకమైన తన పనిని నిర్వహిస్తున్నాడో తెలుస్తుంది. క్రియాత్మకంగా బాలుడు సుశిక్షితుడుగా అయినట్లు బోధపడుతూవుంటే ఇంతకన్న మరేనిదర్శనం కావాలి? కాన కృత్రిమ వ్యాయామశిక్షణకన్న ఉత్పత్తిశక్తితో కూడుకొన్న వ్యాయామవిద్యే శ్రేయస్కరం.

1937 సం॥లో గాంధీజీ తన జీవితచర్యల్లో ముఖ్యంగా బేసిక్ విద్యావిషయమై అమితశ్రద్ధ తీసుకొని, 7-14 సంవత్సరములవరకు యేవిధంగా విద్యావిధానం వుండవలెనో తీవ్రకృషి చేసినారు. ఈవయస్సులోపల విద్యార్థి మెట్రిక్యులేషన్ పూర్తి చేస్తూ ఇంగ్లీషు లేకుండినాసరే, గ్రామీణపరిశ్రమల్లో పూర్తిగా సామర్థ్యం సంపాదించేందుకు శక్తికలిగి తనజీవితాన్ని గడిపేటట్లు స్వతంత్రంగా వుండవలెనని ఆశించియుండినారు, అయితే తన జీవితకాలములోను, స్వాతంత్ర్య సంపాదనానంతరమున్నూ, ఈ విద్యావిధానంతోపాటు ప్రయోజన విద్యకూడ అమల్లోకి రాలేదని చాలా విచారించారు.

## నయీతాలిమీ సంఘము

గాంధీజీ జైలునుంచి విముక్తులైన వెంటనే స్వాతంత్ర్యపోరాటం అంత్యసమయములో "సమగ్ర

పడుతూ వుంటే స్నేహితులమాదిరి యెందుకు ఆమాదిరి బాధపడుతూ వుండేది వివరిస్తారు.

సేవాగ్రాంలోని పాఠశాలలోని విద్యార్థులు వారికిచ్చిన చిన్న తోటసామానులతో ఎరువుగుంటలను భద్రపరుస్తూ, మరుగుదొడ్లను నిర్మిస్తూ, మలమూత్రాదులపై మట్టిని నింపుతూ యెప్పుడు యేదో ఒకపనిలో నిమగ్నులై వుంటారు. ఈ మాదిరిగా వీరు ఆరోగ్యసూత్రాలను అభ్యసిస్తూ అద్యతన భావిలో తమస్వగృహకృత్యాలను నిర్వహించేందుకు సన్నాహపడుతున్నారు. తోటలు జాగ్రత్తగా పెంచుకొని, కాయగూరలు పండించి, మిత్రులతోను తల్లిదండ్రులతోను, వంటలు, విందులు, ఆరగించుతుంటూ ఉల్లాసంగా కాలం గడుపుతున్నారు. వంట సామానులు శుభ్రముగా కడిగి వుంచవలసిన చోట వుంచుతున్నారు. బాధ్యతగల పెద్ద విద్యార్థులు సరిగా వుంచినారా? లేదా? అని అజమాయిషి చేస్తారు. ఈ కార్యకలాపాలవల్ల గృహశిక్షణకూడ యిచ్చినట్లు అవుతుంది.

ఇక్కడ చిన్నబిడ్డలు దూదిని శుభ్రము చేయుటలోను, ప్రత్తిగింజలను వేరుచేయుటలోను, నిమగ్నులై వుంటారు. వీరు ఈ పనిని జాగ్రత్తతోను, పనితనముతోను, చేయుటచూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ గింజలతో లెక్కించడము, అంకెలరూపములను యేర్పరుస్తారు. మునుముందు పై తరగతుల చేతిపనులకు ఈ అనుభవము ఉపయోగపడుతుంది. పెద్ద విద్యార్థులు దూదిని యేకడం, వడకడం, మున్నగు పనులు చేస్తారు. క్రొత్త విద్యార్థులు యెట్లు శుభ్రముగా వుండేది వివరిస్తారు. ఇందుకుగాను వారానికి రెండురోజులు "గుడ్డలు శుభ్రపరిచే దినాలు" (Washing Days) గా ప్రత్యేకించి ఎలా గుడ్డలు శుభ్రపరచేది నేర్చుకొంటారు.

ఈ మాదిరి ప్రత్యక్షశిక్షణద్వారా, కార్యాచరణద్వారా, ప్రత్యక్షజ్ఞానం కలిగించేందుకు ఆరోగ్యం, సృష్టివిద్య, అన్నిరకాల వృత్తిసంబంధమైన పనులు, నేర్పుతున్నారు. ఇక్కడనే బేసిక్ విద్యావిధానానికి బలమైన పునాది యేర్పడుచున్నది. వృత్తి విద్యావిధానములో ప్రాథమికదశపూర్తి అయ్యేలోపల విద్యార్థుల్లో లోకజ్ఞానం, గణితం, సృష్టివిద్య, సాంఘికశాస్త్రం, మున్నగువాటిలో లోకజ్ఞానం ఆర్జిస్తూ వ్రాసేందుకు, చదివేందుకు, శక్తివంతులౌతారు.

## బేసిక్ విద్యలో దశలు

బేసిక్ విద్యావిధానం యెనిమిదవ తరగతివరకు ఇదేమాదిరిగానే వుంటుంది. ఆ తరువాత విద్యార్థులు సంపూర్ణ జ్ఞానవంతులుగాను చర్ఖాలు, తక్లీలతో నూలుతీయడం, బట్టనేయడం, మున్నగునవి నేర్చుకొంటారు. ప్రాథమికదశలో బడితోటలో నేర్చిన అనుభవముతో ఈ దశలో పొలంపనులు ప్రారంభిస్తారు. మూడునాలుగు దశల్లో విద్యార్థులు నేత, తోటపనుల అకౌంట్లు చూసుకోవడం, అసెంబ్లీ సభ్యుల ఎన్నిక, మంత్రివర్గం నిర్మాణంచేసుకొని, యెవరికర్తవ్యాన్ని వారు బాధ్యతతో నిర్వహిస్తారు. పాఠశాల వార్షికోత్సవాలు, సమావేశాల మినిట్సు, ఆటపాటల ప్రోగ్రాము, గ్రామపారిశుద్ధ్యము, వీటి అన్నిటినిగురించియు, పాఠశాల చరిత్రనుగూర్చియు, ఒక సంచికను (Magazine) ప్రచురిస్తారు. ఈ మాదిరిగా నేర్చుకొని స్వగృహాలకుపోయిన తదనంతరం వారితల్లిదండ్రులకు క్రమక్రమముగాపోయి తమగృహాలను యే మాదిరిగా వుంచుకోవలసింది నేర్పుతూ వయోజనవిద్యా ప్రచారానికికూడ మూలకారకులౌతున్నారు.

ఈ బేసిక్ విద్యావిధానం ప్రథమములో కర్మాగారల్లో శిక్షణయిచ్చేమాదిరిగా ప్రవేశపెట్టబడింది. ఎప్పుడూ పుస్తకాల్లో నిమగ్నులైవుండే విద్యావంతులు ఆఫీసుల్లోకూర్చొని పనిచేస్తూ ఈ విధానం పనికిమాలినదని నిందిస్తున్నారు. అయితే భవిష్యత్తును ఆశాజనకంగాను, శక్తిసామర్థ్యాల్లో నమ్మకంగల వారు ఈ విధానమే శ్రేయస్కరమనియు, అయితే యెవరిష్టమొచ్చినట్లుగా వారు దీన్ని నకలుగా వాడితే నిలిపివేయడమే మంచిదనియు, అభిప్రాయపడుతున్నారు. దీన్ని అమలుజరుపడములో ఆశాజనకంగాను, నమ్మకంగాను, వుండాలి. కాన మన పూజ్యబాపూజీ నిరంతరం తండ్రి బిడ్డలకు హితవు గరుపుతూ వుండిన మాదిరి ఈ విద్యావిధానాన్ని అమలుజరిపి, మన భావిసంపదయగు బాలబాలికలను విజ్ఞానవంతులుగా, కర్తవ్యపరాయణులుగా, గ్రామోద్ధరణకు ఉపక్రమించేటట్లు చూడాలి. శతాబ్దాల తరబడి అంధకారములో వుండిన ప్రాచ్యఖండం వెలుగు అణగారి యుండినది తిరిగి ఈ జ్యోతిని దేదీప్యమానంగా పాశ్చాత్యదేశాలకంటె అధికతరంగా వెలిగించాలి.

(స్వతంత్ర సౌజన్యంతో)




1

మానుమీ మంత్రపఠనమ్ము మాను కీర్త
నమ్ము క్షేత్రసీమల గణనమ్ము మాను
వట్టి చీకటికోన దేవాలయాన
తలుపు లన్నింటి మూసి యేదైవము కయి
ధ్యాన మొనరింతువోయి ? నీయక్షియుగము
తెరచి నీముందు లేడుగా దేవు డనుచు
జ్ఞాన మార్జింపుమయ్య విజ్ఞానరాశి.

2

హాలము కేలదాల్చి యహరహంబునుగూడ
మేనికష్టమునను మెలగు హాళి
కాళియెడల సతనికాపురం బలరెడు
హరిని గాంచగలవు అందె భక్త!

3

హరిని గాంచనౌను ఆశ్రమించుచు రోజు
రాయిముక్క గొట్టి రథ్య వేయు
కష్టజీవి వదన కమలాలయమ్మున
బంధితాలయాన బడయు లేవు.

4

ఎండ వాన కోర్చి యేవేళ పొరలాడి
దుమ్ము ధూళి యనక నెమ్మ లరుగ
కష్టపడుచు నెవడు కాన్పించునో యందె
వానివలెనె వచ్చువా డతండు.

5

మోక్ష మెచటదొరకు మోక్షాధిదేవతె
సృష్టిబంధమునను చేరి నిలువ
ఎల్లవేళ లతడు ఎనయును మనతోడ
స్వేచ్ఛ హరికిగూడ వేరె లేదు.

6

ధ్యాన మెడలి రమ్ము-అచ్చటనే వీడి
పూలు అగరు ధూపములను వేగ
ప్రత్యవాయమేమి వసనాలు దుమ్మైన
జీర్ణమైన దేవు జేరగలవు.

7

చెంత నిలువనేర్తు చెమటూడ్చు శ్రామికా
నీవు కష్టజీవనిలయ మూట
నతనియాలయమ్ము అంతరార్థ మ్మింతె
అతనిజాడ లరయ నగుగుపట్లు.

"పామర్తి"
(రవీంద్రుని కృతికి అనువాదము)

## * * ఓ బడిపంతులా ! * *

రచన : డొంకాడ సత్యనారాయణమూర్తి పట్నాయక్.

కరువులు అధికం ధరలు విపరీతం
బరువులు ఆగని అనువు లేవు అనే బోరులతో
పలికిలించుచున్న పశువులకు పస్తులతో
మలమల మాడి ఉసురంత ఎగిరిపోతూ
సివిధ్యుక్త కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ
పరమ దౌర్భాగ్యుడవై దరిద్ర దామోదర
రాజ్యానికి రాజువు ఓబడిపంతులా !
విశాలాంధ్ర విశ్వఖ్యాతికి వెన్నెముకయంచు
జాతీయనాయకులే యెంతురుగాని
పూర్ణశక్తి పూజ్యం ఓబడిపంతులా !

* * *

బ్రతుకు దెరువు లేక బడిపంతులయ్యావు
బ్రహ్మ వ్రాత బ్రహ్మ వ్రాత
చస్తూనే జీవిస్తావు
యీవిశాల జగతిలో
ఓబడిపంతులా ! !

* * *

అదిగాదోయి అదిగాదోయి !
తెల్లదొరలనాటి శాసనము
నేడె సవరించుడని సక్రమముగా
అడగాలోయి అడగాలోయి !
అడిగితేగాని అమ్మయినా బువ్వ
పెట్టదోయి ! పెట్టదోయి ! ఓబడిపంతులా !
ఇంటిబాడుగ అలెవన్సులు యివ్వాలని
ఎయిడెడ్ టీచర్లకు మూడు రూపాయిలు
ప్రభుత్వమే యివ్వాలని అడగాలోయి !
అడగాలోయి ఓ బడిపంతులా ! ! !

* * *

## ప్రాథమికోన్నత పాఠశాలలందు సామాన్య విజ్ఞానశాస్త్రమును బోధించుట యందుగల యిక్కట్లు

శ్రీ కె. సిద్ధలింగపిళ్ళ టీచరు – తిరుపతి

1952 సంII రంII వరకును E. S. L. C. 8 వ తరగతి ప్రభుత్వపరీక్షకు సామాన్యవిజ్ఞానశాస్త్రమును పరీక్షవిషయముగా ప్రభుత్వమువారు నిర్ణయించి యుండలేదు. ప్రపంచమందంతట విజ్ఞానశాస్త్రము మానవ భవిష్యత్తునకు తోడ్పడి, అన్నిపాఠములకన్న ప్రథమస్థానము వహించుచున్నది. ఉన్నత పాఠశాలలందేమి, కళాశాలలందేమి, దీని ప్రాముఖ్యము చెప్పనలవిగాదు. ప్రాథమికోన్నత పాఠశాలలందు E. S. L. C ప్రభుత్వపరీక్ష ఆంగ్లములో కృతార్థుడైన యొక విద్యార్థి IV వ. ఫారములో చేరిన సామాన్యవిజ్ఞానశాస్త్రమందు వానికి కావలసిన పూర్వజ్ఞాన ముండదు. ఉన్నతపాఠశాలలో IV వ ఫారములో చదువు విద్యార్థికిని, ప్రాథమికోన్నతపాఠశాలనుండి IV వ. ఫారమునకు ప్రవేశము కోరు నొక విద్యార్థికిని, విజ్ఞానశాస్త్రములోగల జ్ఞానార్జన హస్తిమశకాంతరము. అట్టి భేదాను గమనించియే ప్రభుత్వము వారు కనికరించి సదరు విజ్ఞానశాస్త్రమును ఈ 1953 సంIIరంII నుండి E. S. L. C ప్రభుత్వ పరీక్షకు పరీక్షాపాఠముగా నిర్ణయించిరి.

విజ్ఞానశాస్త్రమును 8 వ తరగతి ప్రభుత్వపరీక్షగా నిర్ణయించుటతోనే పూర్తి తీరిపోలేదు. అన్ని ఇతరపాఠములను ఎక్కువ బోధనోపకరణములు లేకుండ బోధింపవచ్చును. కాని విజ్ఞాన శాస్త్రబోధన కట్లుగాదు. ఎక్కువ బోధనోపకరణములు కావలసియున్నవి. విద్యార్థులకు నల్లబల్లపై చిత్రపటములు లిఖించి చూపుటకన్న, ప్రయోగములు చేసి చూపుట అత్యవసరము. ఉపాధ్యాయులు చెప్పు పాఠములను వినుట కన్న ప్రత్యక్షముగా వారే ఆ ప్రయోగములను చేసి చూచుటవలన విజ్ఞానశాస్త్రమందుగల యథార్థతను తెలిసికొందురు. ఎన్నటికిని మఱువరాక చిరస్థాయిగా మనస్సున నాటుకొనును. ప్రాథమికోన్నత పాఠశాలా నిర్వాహకులు, విజ్ఞానశాస్త్రబోధనకు వలసిన బోధనోపకరణములను సరఫరా చేయకున్న, సదరు

పాఠములను బోధించు ఉపాధ్యాయు డెట్లు విద్యార్థులకు బోధింపగలడు ? విద్యార్థులు ప్రభుత్వపరీక్షలో ఎట్లు కృతార్థులు కాగలరు ?

పురపాలకసంఘమువారిచేతను, జిల్లాబోర్డులు, పంచాయతీబోర్డులు, ప్రయివేటు మేనేజిమెంటుల చేతను, నిర్వహింపబడు వివిధ సంస్థలును, ప్రాథమికోన్నత పాఠశాలలందు విజ్ఞానశాస్త్ర బోధనకు కావలసిన బోధనోపకరణముల సరఫరా చేయుటకు ప్రార్థించుచున్నాను. ప్రభుత్వమువారు వివిధసంస్థలచే నిర్వహింపబడు మేనేజిమెంట్లకు సదరు విజ్ఞానశాస్త్ర బోధనోపకరణములు చాల ముఖ్యములనియు, వాటిని తక్షణం సరఫరా చేయవలెననియు, నాదేశించవలయునని కోరెదను. ఉపాధ్యాయునకు గల ఇక్కట్లను తీర్చి, విద్యార్థిలోకమునకు సహాయపడ ప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నాను.

---

## 8 వ తరగతి విద్యార్థులకు

# భూ గో ళ బో ధ నా ం శ ము లు

రచన :- బంగారం, అమలాపురం

1. ప్రపంచములో అమితవేడిగల దేశము, ఎడారి, చలి, గల ప్రదేశములు ఏవి ? 1 బర్మా 2 సహారా 3 సైబీరియా.
2. ,, ఎత్తైన పర్వతములేవి ? — హిమాలయ పర్వతములు
3. ,, ఎత్తైన శిఖరమేది ? — గౌరీశంకరము. (29002 అ.)
4. ,, ఎక్కువ నీరుగల రెండునదులు ? — 1 అమెజాన్ 2 కాంగో
5. ,, పెద్దజలపాత మేది ? — నయాగరా
6. ,, పెద్దసరస్సు ఏది ? — సుపీరియర్
7. ,, ఎక్కువ గోధుమపండించు దేశములలో మొదటిది ? — అమెరికా సంయుక్త రాష్ట్రములు (ప్రయిరీలు)
8. ,, పంచదార ఎక్కువగా ఉత్పత్తిచేయునది ? — జావా
9. ,, రబ్బరు ఎక్కువగా ఉత్పత్తిచేయునది ? — బ్రెజిలు
10. ,, ఎక్కువ వర్షము గల ప్రదేశము ? — చిరపుంజి (అస్సాము)
11. ,, ఎక్కువ అభ్రకము దొరకు ప్రదేశము ? — బీహారు (ఇండియా)
12. ,, బియ్యము ఎగుమతిచేయు రేవులలో మొదటిది ? — రంగూన్
13. ,, ఎక్కువ కర్పూరము దొరకు ప్రదేశము ? — ఫార్మోజా
14. ,, ఎక్కువ నికెలు ఉత్పత్తిచేయు ప్రదేశము ? — సడ్బరీ
15. ,, నదులలో 2 పొడవైనవి ? — 1 మిసిసిపి 2 నైలునది
16. ,, నదీ రేవులలో మొదటిది ? — సెంటులూయి
17. ,, రైల్వేజంక్షనులలో గొప్పది ? — చికాగో
18. ,, ప్రసిద్ధిగాంచిన గుఱ్ఱములు ఎక్కడనున్నవి ? — నెజిడ్ (పీఠభూమి)
19. ,, ప్రమాణ కాలమేది ? — గ్రీనిచి కాలము
20. ,, తగరము ఎక్కువగా ఎక్కడ లభించుచున్నది ? — (మలేయా)
21. ,, పెద్దరైలు మార్గమేది ? — ట్రాన్సుసైబీరియన్ రైల్వే
22. ,, ఏనది మీద ఎత్తయిన రైలువంతెన కట్టియున్నారు ? — జాంబెసి
23. ,, పెద్దపట్టణములు మూడు తెల్పుము ? — 1 లండను 2 న్యూయార్కు 3 టోకియో
24. ,, ఎక్కువ బొగ్గుదొరకు స్థలము ? — దామోదర్ లోయ
25. ,, ఎక్కువ బంగారము నుత్పత్తిచేయునది ? — ట్రాన్సువాల్

---

# ప్రావిడెంటు ఫండు రూల్సు

( 1952 నవంబరు నెలతరువాయి )

అనువాదకుడు : కొండ్రెడ్డి సూర్యప్రకాశం.

## అప్పెండిక్సు జి (అనుబంధము జి)

(12 వ నిబంధన - 'బి' (11) ప్రకారం) ఎస్సయిన్‌మెంటు ఫారం టీచర్సు ప్రావిడెంటుఫండులోని 12 వ నిబంధన ప్రకారము, సొమ్ము చెల్లింపబడుటలో తేడా పాడాలు వచ్చినచో నేనే జవాబుదారుడనై యుండునని హామీ యిచ్చునిమిత్తం. యిందుతో పంపించిన నమ్మక పత్రమును మదరాసు గవర్నరుగారికి ................................ పేరుగల నేను పంపుకొనుచున్నాను.

ఇంతకు ముందు అసలులోనున్నట్టిన్ని, లోపలనున్నట్టిన్ని, పోలసీ మరియొకటి ఇంతకుముందు నేను ఎప్పుడున్నూ పంపియుండలేదని యిందుమూలముగా ఋజావుచేసుకొనుచున్నాను.

| | |
|---|---|
| తే } | చందాదారుని చేవ్రాలు. (ఒక సాక్షి సంతకము) |

## అప్పెండిక్సు " హెచ్చి " (అనుబంధము. హెచ్)

టి. పి. యఫ్ రూల్సు—నిబంధన 12. (సి) 1 ప్రకారం ఫారం

టీచర్ల ప్రావిడెంటుఫండు నుండి సొమ్ము తీసికొని జీవితభీమా ప్రిమియములు చెల్లించుటకుగాను వ్రాసెడు దరఖాస్తు ఫారం.

1. చందాదారు పేరు.
2. పనిచేయు స్కూలు పేరు, హోదా.
3. ఇన్‌స్యూరెన్సు కంపెనీ పేరు, పోలసీ నెంబరు చెల్లింపవలసిన ప్రిమియం మొత్తం.
4. ఈ దరఖాస్తు తేదీనాటికి సేవింగ్సు బ్యాంకు ప్యాసుబుక్కులోని బాకీ నిలవ మొత్తం.
5. చందాదారు తనవంతు తాను చెల్లించిన కంట్రిబ్యూషను మొత్తం. (మేనేజిమెంటు చెల్లించినది మినహాయించేది)
6. తీసుకొనవలసిన సొమ్ము మొత్తం (రూపాయలలో మాత్రమే. అ. పై. వ్రాయరాదు.)

| | | |
|---|---|---|
| తేదను / తేదీ } | కరస్పాండెంటు సంతకం. | చందాదారుని సంతకం. |

## అప్పెండిక్సు ఐ (అనుబంధము ఐ)

నిబంధన 12. సి. iv ప్రకారం

జిల్లా విద్యాధికారి నియమించవలసిన రిజిష్టరు.

1. వరుసనెంబరు.
2. పోలసీ నెంబరు.
3. ప్రిమియం మొత్తం సొమ్ము.
4. వాయిదా తేదీ.
5. రిమార్కులు.
6. మొత్తం సొమ్ము } తీసుకొనిన ప్రిమియం
7. నెల. } తీసుకొనిన ప్రిమియం
8. చెల్లించిన కాలము పూర్తి
9. డి. ఇ. ఒ. గారి చేవ్రాలు. తేదీ, యిక్కంటేక్సు లేదనిన్నీ, తనిఖీ చేయబడినదనిన్నీ ఋజువుకుగాను ఆఫీసుస్టాంపు ముద్ర-స్టాంపు } అందుకొనిన ప్రిమియం రసీదులు.

## అప్పెండిక్సు జె. (అనుబంధము జె)

నిబంధన 12 డి ప్రకారం.

మదరాసు గవర్నరుగారు తిరిగి ఒప్పుదల సంతకము చేయునిమిత్తం ఏర్పడిన ఫారం.

19 సం॥రం నెల
వ తేదీ

గవర్నరుగారి తరపున ఫలాని వారి సమక్షమందు జిల్లావిద్యాశాఖాధికారిచే వ్రాయబడినది

డి. ఇ. ఒ గారి చేవ్రాలు.

సమాప్తి (పూర్తి చిరునామాతో ఒక సాక్షి సంతకం)

మరా:—తెనుగులోనికి తర్జుమా చేయుటలో తేడాలున్నవనిగాని, అర్థము సరిగా అగుటలేదు అనిగాని, సందేహములు వచ్చినవారును, నిబంధనలు సరిగా బోధపడనివారును, యీ దిగువ అడ్రసుకు 0-2-0 తపాలా బిళ్ళలు పంపుచు వ్రాయవచ్చును.

కొండ్రెడ్డి సూర్యప్రకాశం.
మేనేజరు - భారతీ విద్యాలయం, కొర్లపాటివారిపాలెం అంబాజీపేట. (పి.ఒ.)
(అమలాపురంతాలూకా, తూ. గో. జిల్లా.)

---

# ప్రకృతి పరిశీలన-తోటపని

ఓలేటి-పంచముఖేశ్వరరావు-పురిటిపెంట

విద్యలలోకెల్లా ఉత్తమమైన విద్యే సృష్టివిద్య (Nature study) ఇటువంటి విద్య మరొకటిలేదు. అందుకే ప్రహ్లాదుడు. కుంభినీధవు చెప్పెడి గురుడు గురుడు చక్రహస్తుని ప్రకటించు చదువుచదువు అన్నాడు. సృష్టి రహస్యాన్ని తెల్సికోవటమే పరమాత్మ స్వరూపాన్ని తెల్సికోడం సృష్టిమర్మమే వేదాంతమర్మం.

మన నిత్యజీవనాధారముౖలైన ప్రతివస్తువును సృష్టినుండే పొందుతున్నాం. అందువల్ల ఆసృష్టికర్తయొక్క అపారశక్తి విశదమవుతోంది. ప్రకృతిమాతను ఆరాధిస్తూ, ప్రకృతి జనకుని పూజసల్పుతూ, ఆనందాబ్ధిని ఓలలాడుటకంటె సౌఖ్యప్రదమైన దేది?

అయితే మన వారు యీ ప్రకృతిని ఏమాత్రం అభ్యసించారు? అంటే......

మన ఆయుర్వేదం మూడువంతుల పుష్పాదిక వనమూలికా ప్రధానమైనదే. ఇక కవుల సంగతంటారా! వీరి ప్రబంధాలలో ఋతువర్ణనలు. వన వర్ణనలు చదివితే బోధపడుతుంది. సామాన్య మానవులకు సైతం సృష్టి పరిశోధన కొంతైనా లేకపోలేదు. అట్టా కాకపోతే యీక్రింది సామెతలెందుకు బయలు దేరుతాయ్ చెప్పండి.

"విత్తు సహాకారిగాకున్న రిత్తనేలవంధ్యయగుగాక తాఫలవంతమగునె"

"పెరులో పెనుగాఋ బలసినట్టు"

"పోయిన కళ్ళిచ్చు పొన్నగంటి"

"ఎంతచెట్టుకి అంతగాలి"

"తీగకి కాయబరువా?"

"కాచిన చెట్టుకి తాలదెబ్బలు"

"నువ్వుగింజకి 100 వ్యాధులు"

ఒక గులాబి పువ్వునుచూస్తే—

కవి దాని అందచందాల్ని వర్ణిస్తాడు.

రసికుడు దానిపరిమళాన్ని ఆఘ్రాణిస్తాడు

వ్యాపారస్థుడు అది ఎక్కడ బాగా అమ్మకమవుతవో ఆలోచిస్తాడు.

వైద్యగాడు దానికి ఎట్టిదోహదం అవుసరమో వితర్కిస్తాడు.

శాస్త్రజ్ఞుడు దానినిర్మాణ క్రమమును గూర్చి దానినుండి ఎట్టి అత్తరు తయారు చేయవచ్చునో తలపోస్తాడు.

ఈ విధంగా ప్రతివాడు నిత్యం సృష్టిని పరిశీలిస్తూనే వుంటాడు.

ఈ ప్రకృతి పాఠములను సృష్టి పరిసరములలోనుండి స్వయముగా పరిశీలించి తెల్సికొనుట ఉత్తమము, పుస్తకము చదివి తెల్సికొనుట మంచిపద్ధతిగాదు, ఉడుతపాఠమును చెప్పినప్పుడు ఉడుతను బడిగదిలోనికి తెచ్చినచో అదిపిల్లలను చూచి బెంబేలెత్తి విపరీత చేష్టలు చేస్తుంది, చెట్టుక్రిందికిపోయి చూపించి చెప్పాలి, ఇందుకు బడి విహారాలు ఉపకరిస్తాయ్. చదివి సంపాదించు జ్ఞానము అల్పము. చూచి, చేసి, నేర్చుకున్నందువల్ల విషయము బాలుని మనస్సులో సూటిగా నాటుకొనేందుకు అవకాశంవుంది.

తోటపని చేయుటవలన భావిపౌరుడు కాబోయే బాలునకు—

# ప్రాథమికోపాధ్యాయ సంఘాలు-ఉపాధ్యాయుల కర్తవ్యము

## కన్వీనర్ ఆంధ్రరాష్ట్ర ఎయిడెడ్ ఎలిమెంటరీటీచర్ల మహాసభలు-గుంటూరు

### కొత్తపల్లి సీతారామయ్య

ఇదివరలో మన ఎలిమెంటరీస్కూలు టీచర్లకు సంఘ స్వాతంత్ర్యములేదు, ప్రభుత్వమువారు 416, 417, g. o. లను యేర్పాటుచేసి ఎయిడెడ్ టీచర్లు ఒక సంఘముగాను, బోర్డుటీచర్లు ఇంకొక సంఘముగాను, మునిసిపల్ టీచర్లు మరొక సంఘముగాను, యేర్పాటుకావాలని నిర్ణయించారు. వీరు తమతమ తాలూకాసంఘాలను యేర్పాటు చేసుకొనుటకు అవకాశముండెడిదేగాని. జిల్లారాష్ట్రసంఘాలను ఏర్పాటు చేసుకొనుటకు అవకాశములేదు. వివిధ మేనేజిమెంట్లలోని టీచర్లంతకలసిఉమ్మడిగా ఒక సంఘముగా యేర్పాటు అగుటకు అవకాశము అసలే ఉండెడిదికాదు.

అప్పట్లో పై g. o. ల కనుగుణ్యముగా మన ఎయిడెడ్ టీచర్లు, టీచరుమేనేజర్లు మనసంఘాలను యేర్పాటుచేసుకొని సక్రమాందోళనద్వారా మనకున్న ప్రత్యేకసమస్యలను ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి నివేదించుచు, అనేకవిజయాలను సాధించుకొనుచు వస్తూయున్నాము. గ్రాంట్లలో 50% వరకు హెచ్చించుచు, తగ్గించుపద్ధతిని రూపుమాపించి శైలెన్ స్కేళ్ళను యేర్పాటుచేసుకొన్నాము. స్కూలు మెయింటినెన్సు ఖర్చులకు టీచర్ల గ్రాంట్లలో 15% వరకు కోయుపద్ధతిని ఎత్తివేయించి మెయింటునెన్సుగ్రాంటును మేనేజర్లకు ప్రభుత్వము ప్రత్యేకముగా యిచ్చునట్లు చేయించుకొన్నాము. రాష్ట్ర సంఘాలు యేర్పాటుచేసుకొనుటకు అవకాశాలు కలిగించమని ఆందోళనచేస్తూ వచ్చాము.

1947 సం॥లో మేము గుంటూరులో రాష్ట్ర మహాసభలు యేర్పాటుచేశాం. రూల్సును వ్యతిరే

---

౨౦౬ వ పేజీ తరువాయి

ఏ యే కాలములం దే యే వ్యవసాయములు చేయవలెనో ఏయే పైరులకు ఏయే ఎరువులు వేయాలో ఏ పైరునకు ఏచీడ పురుగులు పుడతాయో వాటిని నివారించటం ఎట్లాగో—

తోటలను ఎట్లా అందముగా పెంచాలో—

అంట్లు ఎట్లా కట్టాలో—

ఏయే ఋతువులందు ఏయే కాయగూరలు, ఫలజాతులు, పువ్వులు, కాయునో, ఫలించునో, పూయునో మొదలైన విషయాలు స్వయముగా తెల్సికోగలరు. స్వీయానుభవమునకు ప్రత్యక్ష నిదర్శనములకంటె తదితరములు సాటిరావుగదా.

ఈతోటపనివల్ల బాలురకు తరగతిలో పాఠాలు చదివిన మనోపరిశ్రమవల్ల కలిగిన ఆయాసం తగ్గుతుంది. ఇంటి ఆవరణ, పరిసరాల్ని, ఎట్లా సౌందర్యోపేతంగా చూచుకోవాలో అవగాహన అవుతుంది. మొక్కలు పెంపకంలో తరిఫీదు కలుగుతుంది. కూరగాయలు, పండ్లు, పండించు కోటం తెల్సి కొంత ధనవ్యయం తగ్గుతుంది. పిల్లలకు ఒకరితో నొకరుకల్సి పనిచేయు ఐక్యశక్తి ఉద్భవిస్తుంది. "కూలివానివలె పనిచేయుట హీనము" అని విద్యార్థులలోనున్న నీచభావము నశిస్తుంది. వ్యవసాయ సంబంధమైన పనులయందు అభిరుచి పుడుతుంది. పట్నవాసముకంటె పల్లెటూరు నివాసమే పరమోత్తమమైనదని గుర్తిస్తారు. నోరులేని పశుపక్షిజాలం కూడా తనవలెనే సృష్టికర్త అనంత సంతానంలోనిదేకదా అని వాటియెడ సానుభూతి కలిగివుంటారు. సృష్టిమీద అభిమానం పుడుతుంది.

కించకుండా రాష్ట్రమంతటికి ఒకవుమ్మడి కార్యక్రమము యేర్పాటుచేసుకొందామని అనుకొన్నాము. మా ఆశయాలకు విరుద్ధముగాను, అప్పటిరూల్సుకు వ్యతిరేకముగాను, చెన్నుపాటి లక్ష్మయ్యగారు, వారి అనుచరులు, రాష్ట్రసంఘాన్ని యేర్పాటు చేశారు.

లోగడ పనిచేయుచున్న తాలూకా సంఘాలకు పోటీగా ఐక్యసంఘాలంటూ లేవదీశారు. మేము ఆ పద్ధతిని వ్యతిరేకించుచు ఎలిమెంటరీస్కూళ్ళు అన్నీ ఒకే మేనేజిమెంటుక్రిందకు వచ్చువరకు మేనేజిమెంటువారీగా ఎవరిసంఘాలు వారికుంటేనే ఎవరికష్టాలువారు ఎప్పటికప్పుడు అధికారులతో చెప్పుకోటానికి ఎంతో వీలుగా నుంటుందని వాదించాము. కాని మావాదనను వారు పెడచెవిని బెట్టినారు. ఉపాధ్యాయులకు ఎలా సేవచేయాలి అనే ఆలోచనను ప్రక్కకునెట్టి ప్రభుత్వానికి ప్రతికూలాందోళన చేయుడములో నిమగ్నులైపోయారు యీ లక్ష్మయ్యగారు. ఉపాధ్యాయులకు ఇష్టములేనిదే సమ్మె నోటీసును ప్రభుత్వానికి యిచ్చారు. ఆ సమ్మె యేవిధముగా విఫలమైంది. వీరి రాష్ట్రఫెడరేషన్‌ను ప్రభుత్వమువారు ఎలా చిన్నాభిన్నం చేపింది. ఇందులో పాల్గొన్న ఉపాధ్యాయులు ఎలా కష్టనష్టాలకు గురియైంది, మీ అందరకు తెలిసిన విషయమే. పైవిధంగా లక్ష్మయ్యగారు వారి ఫెడరేషన్ ఉపాధ్యాయులకు, ప్రజలకు దూరమై ప్రభుత్వానికి కంటకమై అడ్రసుకూడా తెలియకుండ పరారై పోయారు.

ఆ సమయంలో జి. ఒ. ల కనుగుణ్యముగా పనిచేస్తున్న ఉపాధ్యాయుల సంఘాలద్వారా మనం సక్రమాందోళన సలుపుచు అనేక విజయాలను సాధించుకొంటూవచ్చాము. ఉపాధ్యాయ లోకములో జరిగిన మార్పులన్నీ ఈ సక్రమసంఘాల ద్వారా జరిగినవేయని పై అంశములనుబట్టి తేలుచుండగా ఇదంతా మా ప్రభావమేయని యీ లక్ష్మయ్యగారు వారి ఫెడరేషన్‌వారు డప్పులు కొట్టుచున్నారు. ఉపాధ్యాయులంతా అమాయకులని వీరుచెప్పుమాటలు నమ్ముతారని యీ లక్ష్మయ్యగారి భ్రమ.

1947 లో స్థాపితమై వెంటనే ప్రభుత్వ క్రమశిక్షణచర్యలకు గురియై అణచివేయబడిన ఫెడరేషన్‌కు ఉపాధ్యాయ సేవచేయుటకు ఏమైన వీలు పడెడిదేమో మీరే ఆలోచించుకొండి. ఇతరులతో బాటు మనటీచర్లుకూడా వారివారి సక్రమసంఘాల ద్వారా సంఘస్వాతంత్ర్యము ప్రతివ్యక్తికి ఉండాలని చేసిన సక్రమాందోళన ఫలితముగా నూతన రాజ్యాంగచట్టముద్వారా అందరికి సంఘస్వాతంత్ర్యము సిద్ధించింది. దాని ననుసరించి రాష్ట్రసంఘాలు అశాస్త్రీయములు కాకని తేలిపోయినవి. సంఘస్వాతంత్ర్యమును, అరికట్టుచూ వస్తూయున్న జి. ఒ. లను ప్రభుత్వము రద్దుచేస్తుంది. ఈ విజయాన్నంతా తామొక్కరమేసమకూర్చామని ఇతరటీచర్ల సంఘాలకు ఏమీ భాగములేదని యీ లక్ష్మయ్యగారి చిందులు.

ఉపాధ్యాయులు ఇకమీదట వారికి నచ్చిన సంఘాలనువారు నడుపుకోవచ్చుననియు, ఆ సంఘాలకు ప్రభుత్వరికగ్నిషన్ అవసరములేదనియు, ప్రభుత్వమువారు ప్రకటనచేస్తూండగా మన లక్ష్మయ్యగారు లోగడ జి. ఒ. ననుసరించి పనిచేయుచున్న మేనేజిమెంటువారి సంఘాలన్ని రద్దుఅయి పోయినవనియు, ఇక ఫెడరేషను దాని అనుబంధసంఘాలు మాత్రమే నిల్చియున్నవని ప్రచారము చేస్తూయున్నారు. ప్రభుత్వమువారు, కోర్టువారు, టీచర్లకు సంఘస్వాతంత్ర్యం సిద్ధింపజేసినను, మన లక్ష్మయ్యగారు మాత్రము మనలను ఆస్వాతంత్ర్యాన్ని అనుభవించకుండాచేయాలని విశ్వప్రయత్నముచేస్తున్నారు. ఈ లక్ష్మయ్యగారికి ఎంతస్వార్థమున్నదో చూడండి. చిరకాలమునుండి ఉపాధ్యాయులకు సేవచేస్తూయున్న మేనేజిమెంటువారి సంఘాలపై దుమ్మెత్తిపోయుచు వారిపై అభాండాలు వేసి వారిని హడలగొట్టి ఉపాధ్యాయులందరిని నయానో, భయానో, తనఫెడరేషన్‌లో చేర్చుకోవాలనే తృష్ణతో సిగ్గువిడిచి తప్పుడుస్టేటుమెంట్లతో ఉపాధ్యాయులను ఏలా చీకాకుర్చాలని ప్రయత్నించుచున్నాడో చూడండి! ఈ రకముగా చేయడమే వారి పార్టీ పరమావధి కాబోలు.

ఇప్పుడు మనకు సిద్ధించిన సంఘస్వాతంత్ర్యాన్ని మనం ఏలా సద్వినియోగ పర్చుకోవాలి. అనేప్రశ్న మన ఎదుట నున్నది. దీనికి సమాధానము ఇది. ప్రాథమిక పాఠశాలలన్నిటిని ఒకేరకమైన మేనేజిమెంటు క్రిందికి తేవాలని, అందరిటీచర్లకు వారి గ్రేడు ననుసరించి సమానమైన జీతభత్యాలు తదితర వృత్తి సౌకర్యాలు ఏర్పాటు చేయాలని మనము ఎంతగానో, సక్రమాందోళన చేస్తున్నాం. కాని మన ఆశయాలు ఇంతవరకు సిద్ధించలేదు. ఇప్పటికి మన

పాఠశాలలు వివిధ మేనేజిమెంట్ల యాజమాన్యము ననే నడుపబడుచున్నవి. ఒక్కొక్క మేనేజి మెంటులోని టీచర్లకు ఒక్కొక్క రకమైన ఇబ్బందులు ఉండుట మనకెల్లరకు తెలిసినదే. వీరి కున్న సమస్యలన్ని ఒకేరకమైనవి కావు. అందుకని ఏమేనేజిమెంటులోని టీచర్లు ఆ మేనేజిమెంటు వారీగా వారి తాలూకా, జిల్లా రాష్ట్రసంఘాలను, బలపరచుకొంటూ ఉన్నచో వారి నెదిర్కొను ప్రత్యేక సమస్యలను వెంటవెంటనే పరిష్కరించు కొనుటకు వారికెంతో సులువుగా నుండునని ఉపాధ్యాయలోకము యొక్క అభిప్రాయముపై మేము ఒకనిర్ణయానికి వచ్చాము. అవసరమగు సమిష్టి కార్యక్రమాలలో పాల్గొనవలసి వచ్చినపుడు మీ మేనేజి మెంటువారి సంఘాలనుండి ఎన్నికోబడిన సభ్యులను సమ్మేళనపరచి మన కార్యక్రమాలను నిర్విఘ్నముగా కొనసాగించుకోవచ్చునని మా అభిప్రాయము. పైమేనేజిమెంటువారి సంఘాలకు వారికి నచ్చిన ఇతరటీచర్ల సంఘాలతో "ఆఫిలియేట్" అగుటకు సంపూర్ణస్వాతంత్ర్య ముంటుంది.

ఈ విధముగా టీచర్లు మేనేజిమెంటువారీగా తమతమ సంఘాలను నడుపుకోడము, ఉపాధ్యాయులలో చీలికలు కలిగించడమే యని, ఫెడరేషన్ లక్ష్మయ్యగారి వితండవాదము. టీచర్లంతా ఒక ముద్దగా వీరి కలగూరగంప సంఘాలలో చేరితేనే చీలికలు లేకుండా ఉండటం అవుతుందని, అట్లా ఉండుటే ఉపాధ్యాయుల ఐక్యత అనిపించుకొంటుందని, వీరి కుంటి వాదము.

లక్ష్మయ్యగారికి– మా సూటిప్రశ్నలు :–

**1.** ఆంధ్రా టీచర్ల ఫెడరేషన్ (A. T. F.) అను సంఘముండగా ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్ల ఫెడరేషనంటూ మీరు స్థాపించారే ? ఇది టీచర్లలో చీలికలు కలిగించటం అవుతుందా ?

**2.** ఇది ఉపాధ్యాయుల ఐక్యతకు భంగం కలిగించటం అవుతుందా ?

**3.** ఆంధ్రరాష్ట్ర ఉపాధ్యాయులు ఒక సంఘముగా ఏర్పడడము చెన్నరాష్ట్ర టీచర్లలో చీలికలు కలిగించటం అవుతుందా ?

**4.** రాష్ట్రప్రజలంతా కలిసి ఒకే ఐక్యసంఘం ఏర్పాటు చేసుకోవాలనేనా ? మీ ఉద్దేశ్యము ?

**5.** రాష్ట్రచేనేత వారిసంఘము రాష్ట్రవ్యవసాయ కూలీలసంఘం అంటూ ఉండడం రాష్ట్రప్రజలో అనైక్యతకు దారితీస్తుందంటారా ? కాదనేగా మీసమాధానం – మంచిది – ఎవరికెవరికున్న ప్రత్యేక సమస్యల ననుసరించి వారువారి ప్రత్యేక సంఘాల నేర్పరచుకొనడం సహజమని తేలుచున్నది కదా !

పైవన్ని చీలికలుగా పరిగణించ బడనప్పుడు ప్రత్యేక సమస్యలతో ఎంతో కాలమునుండి క్రుగ్గి పోతున్న ఎయిడెడ్ టీచర్లు వారివారి ప్రత్యేకసంఘాలను నడుపుకోవటం టీచర్లను చేర్చడానికి వేసిన ఎత్తుయని దుష్ప్రచారము చేయడం మానవత్వానికి విరుద్ధము కాదా ? ప్రాథమికోపాధ్యాయు లందరు గొర్రెదాటుగా మీ వాదనను అంగీకరిస్తారనేనా మీ భ్రమ.

ఉపాధ్యాయసోదరులారా !

చిరకాలమునుండి మన టీచర్లకు సేవచేస్తూయున్న మేనేజిమెంటువారి సంఘాలు ఎన్నటికి చెడ్డుకాలేదని గట్టిగానమ్మండి. ఆ సంఘాల ప్రాముఖ్యపైన మనజిల్లా రాష్ట్ర సంఘాలను నియమించుకొన్నచో మన ఉపాధ్యాయుల ఉద్యమం ఎంతో సౌష్ఠవంగా ఉంటుందనేది నిర్వివాదాంశము. ఐక్యతా అనే ముసుగుతో పోటీగా కలగూరగంప సంఘాలను లేవదీయుచు, సోదరోపాధ్యాయ సంఘాలపై దుమ్మెత్తిపోయుచు టీచర్లకు ఏలా సేవచేయాలి అనేఅంశాన్ని ప్రక్కకునెట్టుచు నిరంతరము ప్రభుత్వ ప్రతికూలాందోళనములో నిమగ్నులైయున్న యీ లక్ష్మయ్యగారిని నమ్ముకొన్న ఉపాధ్యాయ లోకానికి పట్టబోయేగతి ఏమిమో మీరే ఆలోచించుకొండి. లోగడ వీరు ప్రభుత్వాన్ని వ్యతిరేకించు కార్యక్రమాలను లేవదీసి ప్రభుత్వ క్రమశిక్షణచర్యలకు గురియై ఉపాధ్యాయలోకాన్ని వదలి పరారైనసంగతి మనందరకు తెలిసినదే. మరల వీరు ఆదేవిధముగ ఎప్పుడు పరారైపోయేది ఎవరికి తెలియదు. ఇటువంటివారిని నమ్ముకోవడము కుక్కతోక బట్టుకొని గోదావరిని యీదినట్లేగదా? కాన టీచర్లందరూ మేనెజిమెంట్లవారి సంఘాలను బలపరచుకొని జిల్లా రాష్ట్రసంఘాల స్థాపనకై పూనుకోవలసినదని మేము హెచ్చరించుచున్నాము. ఇందు అవసరమగు సేవచేయుటకు మేము సంసిద్ధముగా నున్నాము.

మేము శాంతియుతమైన చట్టబద్ధమైన పద్ధతులతో ఎయిడెడ్ టీచర్ల రాష్ట్రసంఘాన్ని నిర్మించుటకై గుంటూరులో ఎయిడెడ్ టీచర్ల రాష్ట్రమహాసభలు ఏర్పాటుచేశాము, గౌ॥ మద్రాసు ప్రభుత్వ విద్యా

## వింతపదములు - పొడుపు కథలు

[బాలబాలికలారా! ఈ క్రింద కొన్ని వింతపదములు - పొడుపుకథలు ఉన్నవి. వీటి సమాధానాలు చాలగమ్మత్తుగాఉంటవి. మీరందఱు వీటిని చక్కగానేర్చుకోండి.]

| పదము. | జవాబు. |
|---|---|
| 1. నరముగాని నరము | వానరము |
| 2. కరణముగాని కరణము | వ్యాకరణము |
| 3. మఠముగాని మఠము | కమఠము |
| 4. పురముగాని పురము | గోపురము |
| 5. వారముగాని వారము | కైవారము |
| 6. రతిగాని రతి | హారతి |
| 7. కోడిగాని కోడి | పకోడి |
| 8. మాలగాని మాల | రుమాల |

* * *

| | |
|---|---|
| బ్రతికితే బ్రతికేవాడు | వైద్యుడు |
| చస్తే బ్రతికేవాడు | పురోహితుడు |
| నవ్వితే బ్రతుకునది | వేశ్య |
| ఏడ్చితే బ్రతుకునది | పసిబిడ్డ |
| వ్యాధిలేకయే మూల్గువాడు | చాకలి |
| చలిలేకయే కుంపటికాచుకొనువాడు | కంసాలి |

కూర్పరి : శ్రీ ఎ. వి. గోవిందరాజు, హెడ్మాష్టరు - తోపుదుర్తి.

---

౨౦౯ వ పేజీ తరువాయి

శాఖామంత్రి డా॥ యం. వి. కృష్ణారావుగారు పై మహాసభలను ప్రారంభించుటకు దయతో నంగీకరించారు. వారు గుంటూరుకు వచ్చే జనవరిలో వస్తామని చెప్పినారు. కొన్ని ఎయిడెడ్ టీచర్లు తమతమ మేనేజిమెంటు వారి తాలూకా జిల్లాసంఘాలను బలపరచుకొంటూ ఆసంఘాల కార్యకర్తల అడ్రసులను మాకు వచ్చేజనవరిలోగా పంపగోరుతాము. పై మహాసభలకు రాష్ట్రి నలుదిశలనుండి టీచర్లు తమ డెలిగేట్లను పంపుతూ శక్తివంచనలేని విరాళాలను తామిచ్చియు ప్రజలనుండి వసూలుచేసియు మాకు సర్వవిధముల తోడ్పడగోరుచున్నాము. డెలిగేటు రుసుము రెండురూపాయలు.

గుంటూరు
4-12-52

కొత్తపల్లి సీతారామయ్య
కన్వీనరు

# 1953 ★ క్యాలండరు ★

| జనవరి 31 | ఫిబ్రవరి 28 | మార్చి 31 | ఏప్రిల్ 30 | మే 31 | జూన్ 30 | | | | | | జూలై 31 | ఆగష్టు 31 | సెప్టెంబరు 30 | అక్టోబరు 31 | నవంబరు 30 | డిసెంబరు 31 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గు | ఆ | ఆ | బు | శు | సో | 1 | 8 | 15 | 22 | 29 | బు | శ | మ | గు | ఆ | మ |
| శు | సో | సో | గు | శ | మ | 2 | 9 | 16 | 23 | 30 | గు | ఆ | బు | శు | సో | బు |
| శ | మ | మ | శు | ఆ | బు | 3 | 10 | 17 | 24 | 31 | శు | సో | గు | శ | మ | గు |
| ఆ | బు | బు | శ | సో | గు | 4 | 11 | 18 | 25 | * | శ | మ | శు | ఆ | బు | శు |
| సో | గు | గు | ఆ | మ | శు | 5 | 12 | 19 | 26 | * | ఆ | బు | శ | సో | గు | శ |
| మ | శు | శు | సో | బు | శ | 6 | 13 | 20 | 27 | * | సో | గు | ఆ | మ | శు | ఆ |
| బు | శ | శ | మ | గు | ఆ | 7 | 14 | 21 | 28 | * | మ | శు | సో | బు | శ | సో |

పూర్వకులు :—1. యస్. వేంకట్రావ్ పట్నాయక్, చ. నెం. 342 2. కె. వెంకటప్పారావు, ప్రాథమికపాఠశాలోపాధ్యాయులు, వేణమ్మపేట. 3. గుండేపూడి హనుమంతరావు, శనివారపుపేట. 4. తిరువరంగం రంగయ్య, పాలకొండపేట. 5. కాశిన ఆం[illegible]రావు, [illegible]-పశ్చిమబెంగాల్. 6. వి. వి. శ్రీనివాసరావు, పాతపట్నం. 7. పూలపల్లి నైనాచార్యులు, వైకుంఠలక్ష్మీపురం. 8. నాగెళ్ళ వెంకటరత్నం, ఉదయగిరి. 9. ఆర్. సుబ్రహ్మణ్యం, గంగలకుర్తి అగ్రహారం.

# వివేక ప్రశ్నలు

అక్షరములు నాల్గు - అర్థంబు 'శంభుడు'
ఆదివర్ణముడుప - అగు నొక 'నది';
తీసి కర్థమగును - రెండవవర్ణంబు
చెఱుప; అట్టిపదము - చెప్పుడయ్య!

శ్రీ దోశెల తమ్మిశెట్టి, టీచరు-కింతలవానిపేట.

అక్కరంబు లాఱు - అగునొక్క 'వృక్షంబు'
ఒకటి-రెండు-తుదియు-నొప్పు 'కరకి';
చివరిమూడు చేరి - చెప్ప 'హారం' బగు;
అట్టిపదము చెప్పు - డార్యులార!

శ్రీ కె. పరశురామశాస్త్రి, హెడ్మాష్టరు-పోలుకొండ.

# పదపూరణము

[విద్యార్థులు మాత్రమే వీనిని పూరింపవలెను. చందాదారులు కానివారు విధిగా రెండు అణాల తపాలా బిళ్ళలు పంపవలెను. లేనిచో వారిపేర్లు ప్రకటింపఁబడవు.]

| పదము | అర్థము | | |
|---|---|---|---|
| 1. స - - ము | ఇల్లు | 5. స - - ము | కాలము |
| 2. స - - ము | యజ్ఞము | 6. స - - ము | నీరు |
| 3. స - - ము | దగ్గఱ | 7. స - - ము | గాలి |
| 4. స - - ము | ఎల్లప్పుడు | 8. స - - ము | పద్మము |

కూర్పరి: శ్రీ దోశల తమ్మిశెట్టి, టీచరు - కింతలవానిపేట.

# నవంబరునెల చిత్రప్రశ్నలు

(1952 సం॥ నవంబరు సంచికలోఁ బ్రకటింపఁబడిన)

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు.

౧. చిత్రకాయము. ౨. మురజము.

చందా నెం. రెండు ప్రశ్నలకు సరియైన జవాబులు పంపినవారు.

571 భానూరు సత్యనారాయణ పట్నాయక్‌గారు - హెడ్మాష్టరు - అకలంగి
కౌసులనాటి హనుమచ్ఛాస్త్రిగారు - టీచరు - గంగవరం
149 వాడాడ కూర్మారావుగారు - హెడ్మాష్టరు - మీసాలపేట
230 శేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
566 బగ్గాం సింహాచలంగారు - టీచరు మేనేజరు - పాతబగ్గాం
695 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద
363 చింతాడ రాములుగారు - టీచరు - రామదాసుపేట
341 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
361 ఎ. వి. గోవిందరాజుగారు - హెడ్మాష్టరు - తోపుదుర్తి

చందా నెం. రెండవ ప్రశ్నకు మాత్రమే

366 చి॥ కౌశిన ఆదినారాయణరావుగారు - విద్యార్థి - గరులియా - పశ్చిమబెంగాల్
156 దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట

*

## పదపూరణము - సమాధానములు

1. వదనము
2. వనజము
3. వమనము
4. వరాహము
5. వర్తకము
6. వలయము
7. వల్మీకము
8. వసంతము

| చందా నెం. | సరియైన జవాబులు పంపిన విద్యార్థులు |
|---|---|
| 528 | చి॥ గొంబలి శ్రీరాములు - కె. క్రిష్ణాపురము |
| | చి॥ చింతలూరి వెంకట సూర్యనారాయణమూర్తి - పినపళ్ళ |
| | చి॥ బొండాడ ఆర్థర్‌పాల్ - విద్యార్థి- చెట్టున్నపాడు |
| 521 | చి॥ బంగారం - అమలాపురం |
| | చి॥ ద్రోణాదుల రామయ్య - 5 వ తర - పుల్లలచెఱువు |
| | చి॥ కొకర్లపూడి విజయలక్ష్మీదేవి - 6 వ తర - అలమండ |
| | చి॥ కాశిన ఆదినారాయణరావు - విద్యార్థి - గరులియా - ప. బెంగాల్ |

---

# గమనిక

మా పత్రికకు వ్యాసములు, చిత్రప్రశ్నలు, పదపూరణములు. చిత్రప్రశ్నలకు - పదపూరణములకు సమాధానములు, వార్తలు మున్నగునవి పంపువారందఱును ప్రతినెల 4 వ తేదీలోపల ఈ క్రింది చిరునామాకే సరాసరి పంపుచుండవలెను. లేకున్న అవి మాకు సకాలములో చేరకపోవుట, ఆ నెల సంచికలో ప్రకటింపబడక నిలిచిపోవుట, జరుగుచుండును. ఇట్టి యిబ్బంది కలుగకుండ తమ రచనలను ఈ క్రింది చిరునామాకే పంపుచుండవలెనని మా వ్యాసకర్తలకు మనవి.

చిరునామా—

సంపాదకుడు,
"ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య"
అమరావతి (P. O.)
(గుంటూరు జిల్లా.)




# ఉపాధ్యాయులు – పోషకవర్గము

నేడు ప్రభుత్వమెన్ని ప్రణాళికలు నిర్మించినను, ఎన్ని నిర్బంధ శాసనములు అమలు పఱచినను, ఎన్నివిధముల ప్రచారము చేసినను, ప్రాథమిక విద్య యేమంత తృప్తికరముగా అభివృద్ధి నొందుటలేదు. ఇందుకు ప్రధానకారణమేమి? బాధ్యులెవరు?

ఈ ప్రశ్నలుదయించి నప్పుడు తడుముకొనకుండ ప్రతివారు ఉపాధ్యాయులే యని చెప్పెదరు. ప్రభుత్వముగూడ ఈ యభిప్రాయముతోనే చాలవఱకు ప్రవర్తించుచున్నది. ప్రతితరగతిలోను బాలబాలికల సంఖ్య ఇంతశాతముకంటె తగ్గకుండ ఉండవలెనని నిబంధించుట—విద్యార్థుల హాజరు తగ్గుటకు ఉపాధ్యాయుడే కారకుడని చెప్పుట—పిల్లలను ప్రతిదినము హాజరుపెట్టవలెనని శాసించుట—హాజరు కొఱవడినచో అతనికిచ్చు గ్రాంటును తగ్గించుట—మొదలగునవన్నియు నై యభిప్రాయమునకే దోహదమొనరించుచున్నవి. దీనినిబట్టి ప్రాథమిక విద్యాభివృద్ధి కుంటుపడుటకు ఉపాధ్యాయుడే బాధ్యుడని నిర్ణయింపవచ్చును. కాని ఇది సమంజసమనిపించునా?

ఇందున్న చిదంబరరహస్యము నెఱింగినవారెవ్వరు ఈ యభిప్రాయముతో నేకీభవింపరు. ప్రభుత్వము సిద్ధాంతరూపమున నెన్నియో మార్పులు గావించుచున్నది. కాని ప్రయోగాత్మకముగా వానిని అమలుపఱచ జాలకున్నది. ప్రతిపాఠశాలకు ఒకతోట, ఒకఆటస్థలము, వృత్తివిద్యలకు సంబంధించిన సాధనసంపత్తి, మున్నగునవి ఉండవలెననీ, బాలబాలికలను ఆకర్షించునదిగా ప్రతిపాఠశాల సమస్తపరికరములతో శోభించవలెననీ, ప్రభుత్వము ప్రణాళికల రూపమున చెప్పుచున్నది. కాని యీచెప్పిన వన్ని ప్రతిపాఠశాలలలోను ఉన్నవా? లేవా? అనివిచారించుటలేదు. చెప్పుటతోనే తన బాధ్యత తీఱిపోయినట్లు మౌనము వహించుచున్నది. తాను స్వయముగా నడపు పాఠశాలలలోగాని, స్థానికసంస్థలునడపువాటిలోగాని, యీసాధన సంపత్తిచాలవఱకు కొఱవడియున్నదని చెప్పక తప్పదు. వీటిస్థితియే యిట్లుండ ఇక ఎయిడెడ్ పాఠశాలల సంగతి వేఱుగా చెప్పనేల? ఇట్టిపరిస్థితిలో బాలబాలికలను పాఠశాలలకు ఆకర్షించుటెట్లు? సమగ్ర బోధన చేయుట యెట్లు? ఈ లోపమునకు బాధ్యులు ఉపాధ్యాయులా? ప్రభుత్వమా?

మనది దరిద్రదేశము – అన్నివసతులు సమకూర్ప శక్తిలేదు – ఉన్నవాటితోనే విద్యాభివృద్ధి సాగించాలి– అని చెప్పవచ్చు. దానికిగూడ ఒప్పుకొందము. అట్లయినప్పటికి ఒక్క–ఉపాధ్యాయుని మీదనే గురుతర బాధ్యతను మోపుటధర్మమా? పిల్లల హాజరు కొఱవడకుండ ఉపాధ్యాయుడు కాలికి బలపము కట్టుకొని యింటింటికి తిరుగుట భావ్యమా? అదిఆయన పవిత్రవృత్తికి గౌరవనీయమగునా? ఇవియుమీ పట్టించు

కోకుండ అన్నిటికీ తలయొగ్గి ఆయనగడప పూజలు చేసినప్పటికీ ప్రయోజనము కన్పించుటలేదు. పోషకవర్గము తన బాధ్యతను గుర్తించుటలేదు. "పాపం పంతులుగారు శ్రమపడి వచ్చినా"రని గౌరవింపకపోగా పైపెచ్చు ఇష్టంవచ్చినట్లు తలిదండ్రులు మాట్లాడుతారు. పురుగును విదిలించినట్లు విదిలిస్తారు." "మాకు చదువు వద్దు పోవయ్యా! ఈకరువుకాలంలో ఎంతమంది కష్టపడినా కడుపులు నిండక చస్తుంటే నీ చదువెవ్వరికి కావాలి? మాఅబ్బాయికి పలక బలపాలు, పుస్తకాలు, కొనియిచ్చి అన్నంపెట్టి, చదువు చెప్తానంటే పంపిస్తాము. లేకపోతే మాయింటి గడపకూడా తొక్కొద్దు." అని కసురుకొంటారు. ఇలాంటి పరిస్థితుల్లో ఉపాధ్యాయుడేమి చెయ్యాలి? హాజరు కొఱవడుతుందని ఏడ్వవలెనా? లేక తనగ్రాంటు కోస్తారని మొత్తుకోవలెనా? ప్రతిపల్లెలోను సక్రమంగా పిల్లల్ని బడికి పంపుటలో జరిగే యీలాటి చర్యలు ప్రభుత్వాధికారులకు తెలియకపోలేదు. తెలిసికూడ అన్నివిధాలా బక్కచిక్కిన బడిపంతులు మీద అధికారాన్ని చలాయిస్తూ ప్రాథమిక విద్యాభివృద్ధికి అతడే బాధ్యుడని చెప్పటం యేమంత సబబు? పోషకవర్గంకూడా తన బాధ్యతనుగుర్తించి పంతులుతో తగినంతగా సహకరిస్తే మంచిప్రయోజనం కలుగవచ్చు. విద్యాభివృద్ధికూడా తగినంతగా కలుగవచ్చు. కాని అటువంటిమంచిరోజులు ఇంకా మనదేశానికి రాలేదనియే చెప్పవలెను.

అయితే ఒక్కవిషయం మాత్రం ముఖ్యంగా గమనించాలి. మనది దరిద్ర దేశమనే సాకుతో, వలసినంత డబ్బులేదనే మిషతో, పాఠశాలలసాధనసంపత్తిపట్లగాని, ఉపాధ్యాయుని పోషణపట్లగాని, ప్రభుత్వం అశ్రద్ధచూపుట యేమాత్రము తగదు. పాఠశాలకు కావలసిన పరికరములు లేకుండ ఆకర్షణీయముగా బోధించుట అసంభవము. పాఠశాలగాని, బోధనగాని, ఆకర్షణీయంగాకుండ పిల్లలనురాబట్టుట అంతకంటెకష్టము. కాబట్టి ప్రతిపాఠశాల సంపూర్ణబోధన సామగ్రితో ముందు శోభించాలి. ఆతరువాత ఉపాధ్యాయుని ఆర్థికస్థితి, గౌరవమర్యాదలు, చక్కబడాలి. అతనికి కడుపునిండా తిండి, ఒంటినిండా బట్ట, లభిస్తే యెంతకష్టమైనా పడతాడు. ఏశ్రమకైనా ఓరుస్తాడు. "కడుపే కైలాసం" అన్నసూత్రాన్ని మఱచి "పాఠశాలే పరమపదం" అన్న పవిత్రభావంతో ప్రవర్తిస్తాడు. ఇట్టిమంచిస్థితి ఉపాధ్యాయునకు చేకూరాలంటే ఆర్థికంగా ప్రభుత్వం, సాంఘికముగా పోషకవర్గము ఆయనను ఆదరించాలి. సంఘములో ఆయనకు గల ప్రతిపత్తిని పోషకవర్గం, గుర్తించి అన్నివిధాలా ఆయనతో సహకరిస్తూ, ఆయన్నిగౌరవిస్తూ, తగినంత మర్యాదను చూపాలి. ప్రతివిషయంలోనూ ఆయనకు చేదోడు వాదోడుగానుండి, విద్యాభివృద్ధికి తగినంత దోహదం చెయ్యాలి. అంతేకాని "బ్రతుకలేక బడిపంతులు" అన్న సామెత సార్థకమయ్యేటట్లు ప్రభుత్వం గాని, పోషకవర్గంగాని, ఆయనను ఎంతమాత్రం చిన్నచూపుతో చూడరాదు. దేశాభ్యుదయానికి దేశికుడే మూలము-అన్న పవిత్రసూత్రాన్ని ప్రభుత్వమూ, పోషకవర్గమూ, ప్రజానీకమూ, గుర్తించి తదనుగుణంగా ఆయనను గౌరవించిననాడే దేశమున్నతస్థితికి రాగలదు.

—సంపాదకుడు.



## వయోజన విద్యా వారోత్సవాలు

**బొబ్బిలి :**

శ్రీరామకృష్ణ వయోజన విద్యాపాఠశాల వారు తే 8-11-1952 ది మొదలు ది 12-11-52 తేదీ వరకు వయోజన విద్యావారోత్సవములను స్థానిక పంచాయతీబోర్డు ప్రెసిడెంటు వారి ఆధ్వర్యమున మహావైభవముగా జరిపిరి. చివరిరోజు సాయంకాలము 4 గం. లకు బహిరంగసభ జరిగినది. అందు పలువురు పెద్దలు వయోజన విద్యావశ్యకతను గూర్చి ముచ్చటించిరి.

**కొత్తపేట :**

కొత్తపేట బోర్డు వయోజన పాఠశాలభవనమందు శ్రీ సలాది వీరరాఘవులుగారి అధ్యక్షత క్రింద ది 11-11-52 తేదిన వయోజన విద్యావారోత్సవ మహాసభ జరిగెను. అందు నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించి వయోజనులను విద్యావంతులుగా చేసిననాడే దేశముబాగుపడగలదని పలువురు ముచ్చటించిరి.

కే. రాజారావు.

**పెద్దాపురము :**

పెద్దాపురం మునిసిపల్ 3 వ వయోజన విద్యావారోత్సవము ది 8-11-52 మొదలు ది 12-11-52 వరకు జరిగినది. మొదటిరోజున ఉదయం 8 గంటలకు సీనియర్ డిప్యూటి ఇన్‌స్పెక్టరు శ్రీ ఆకొండపు మల్లికార్జునుడు B. A., B. Ed. గారి అధ్యక్షత క్రింద పతాకవందనము జరిగినది. మునిసిపల్ కమీషనరు, హెల్తుఆఫీసరు, ఈ యుత్సవమునందు పాల్గొనిరి. చివరిరోజు సాయంకాలము [illegible] గంటలకు మునిసిపల్ ఛైర్మన్ శ్రీ చల్లా వెంకట్రావుచౌదరిగారి అధ్యక్షత క్రింద వయోజన మహాసభ జరిగెను. పలువురు వయోజన విద్యనుగూర్చి యుపన్యసించిరి. అధ్యక్షులవారిచే బహుమతులు పంచిపెట్టబడెను.

డొంకాడ, సత్యనారాయణమూర్తి.

**న్యామద్దల :**

12-11-52 తేది రాత్రి 8 గంటలకు న్యామద్దల వయోజన విద్యాకేంద్రమున వయోజన విద్యావారోత్సవ సమావేశము యీగ్రామ ఉన్నత పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీ సి. వి. నారాయణ B. A. L. T. గారి అధ్యక్ష్యమున జరిగెను. సభకు చాలమంది పురప్రముఖులు. ఉన్నత ఎలిమెంటరీ పాఠశాలల ఉపాధ్యాయులు, విచ్చేసిరి. వయోజనులచే దైవప్రార్థనగావింపబడెను. తదనంతరము గత వార్షిక నివేదికను శ్రీ. కె. యల్. నారాయణప్ప అసిస్టెంటుగారు చదివిరి. తదుపరి ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులగు శ్రీ యం. నంజుండరావుగారు వయోజన విద్యావశ్యకతను గూర్చియు, వయోజనుల ముఖ్యకర్తవ్యములను గూర్చియు, ముచ్చటించిరి.

తదుపరి అధ్యక్షులవారు వయోజనవిద్యకు, వయస్సుకు ముడిపెట్టరాదనియు, పూర్వము వయస్సు చెల్లి విద్యనభ్యసించి కవిపుంగవులుగా తయారైన ఆదర్శ పురుషులు - శ్రీ కాళిదాసు, విద్యారణ్య స్వాములు వారి జీవితఘట్టములను చాలాముచ్చటగా తెలియజేసిరి. తదనంతరం సభ్యులకు శ్రీ. కె. యల్. నారాయణప్పగారు ధన్యవాదము లర్పించుటతోడను, వయోజనులకు బహుమతులు పంచుటతోడను, మంగళము గీతములతోను, సభవిజయవంతముగా ముగిసెను.

కె. యల్. నారాయణప్ప.

టి. పెదగరువు :

3 వ దక్షిణ భారతవయోజన విద్యా వారము నర్సాపురం తాలూకా టి. పెదగరువు వయోజన పాఠశాలాభవనము నందు పెదగరువు గ్రామపంచాయితీబోర్డుప్రసిడెంటు వారి అధిపత్యమున జరుపబడెను. సమావేశమునకు 200 మంది వయోజనులు హాజరైరి. సభజయప్రదముగా జరుపబడెను. శ్రీ పంచాయితీ బోర్డు ప్రసిడెంటుగారు వయోజనులకు ఉద్రేకము కలుగునట్లు ఉపన్యసించిరి. తదుపరి పెదగరువు లూథరన్ స్కూలు హెడ్మాష్టరుగారు వయోజన విద్యకు గవర్నమెంటువారు చేసిన సదుపాయములను గూర్చియు, వయోజన విద్యవలన కలుగులాభములను గూర్చియు, విపులముగా ఉపన్యసించిరి. తదుపరి ఆహ్వానసంఘాధ్యక్షుల వారి అభినందనములతో సభముగింపబడెను.

టి. జోసఫ్. హెడ్మాష్టరు

అమలాపురం :

అమలాపురంతాలూకా ఎయిడెడ్టీచర్లయూనియన్ వర్కింగుకమిటీ సమావేశం ది 30-11-1952 తేదీ ఆదివారం పగలు 2-0 గంటలకు అమలాపురంలో యూనియన్ ప్రెసిడెంటుగారగు శ్రీ కె. సోమేశ్వ రావుగారి అధిపత్యమున జరుపబడి యీ దిగువతీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

1. అమలాపురం తాలూకాలోని వెస్టురేంజిలోని పాఠశాలలకు 1952 సెప్టెంబరు నెలతాలూకు బిల్లులు యింతవరకు వచ్చియుండలేదు. టీచర్లు చాలయిబ్బందులు పడుచున్నారు గాన ప్రతినెల 12 వ తేదీలోపున బిల్లులు (చెక్కులు) చేరునట్లుగా పంపుటకు జిల్లా విద్యాశాఖాధికారిగారిని కోరుచు తీర్మానించిరి. మరియు సర్వీసు బిళ్ళలుగాని; పోస్టుబిళ్ళలుగాని, కొరతవచ్చినప్పుడు సదరుబిల్లులు (చెక్కులు) అన్నియు ఆయారేంజీల ఆఫీసర్లకుపంపి వారిద్వారా త్వరలో చేరునట్లు చేయించమనికోరుచు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

2. నవంబరు నెలతాలూకుబిల్లులు (చెక్కులు) జనవరినెలలోవచ్చు సంక్రాంతిపండుగకు ముందుగా అనగా జనవరినెల మొదటివారంలో టీచర్లకు జీతములు. బట్వాడా అగునట్లు ఏర్పాట్లుచేయించుటకుగాను జిల్లావిద్యాశాఖాధికారిగారిని కోరుచు ఏకగ్రీవముగా ఆమోదించిరి. మరియు అంతత్వరితములో డైరెక్టుగా మేనేజర్లకు చెక్కులు బట్వాడా చేయించుటకు వీలులేనిచో రేంజి ఆఫీసర్లద్వారానైనా సదరు పైనవివరించిన కాలములో పంపునట్లు విద్యాశాఖాధికారిగారిని కోరుచు తీర్మానించిరి.

3. మదరాసుగవర్నమెంటు ఆరోగ్యశాఖ 1952 సం॥రం ఆగస్టునెల 13 వ తేదిగల జి. ఒ. 2628 నాన్‌గెజిటెడ్ ఆఫీసర్లున్ను, వారి కుటుంబములున్ను స్టేటుమెడికల్ ఇన్‌సిట్యూషన్‌లలో జాయను అయినప్పుడు ఔషధములున్ను, ఆహారమున్ను, ఉచితముగా సప్లయిచేయుట మొదలగు లాభములతో వైద్య సహాయము పొందుచున్నారు. సదరు జి. ఒ. ప్రకారం లోకలుబోర్డులలోని ఎంప్లాయీలుకు చెందచేసిన విధమునన్నే యీ లాభములను ఎయిడెడ్ ప్రాథమికపాఠశాలల ఉపాధ్యాయులకు, వారి కుటుంబములకు కూడ చెందునట్లు ఏర్పాటుచేయించమని ప్రభుత్వమును, విద్యాశాఖాధికారులను, కోరుచు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

4. ఆహారధాన్యముల ధరలు ఎక్కువగా పెంచుటచేత ఎయిడెడ్ టీచర్ల జీతములు వారి బియ్యపు ఖర్చులకైనను సరిపోకుండుటచేత వారిజీతములను పెంచుటకుగాను ప్రభుత్వమునుకోరుచు తీర్మానించిరి.

5. ఇంటిఅద్దె గ్రాంటులు, త్వరితముగా వచ్చునట్లు ఏర్పాటుచేయించుటకు ప్రభుత్వమువారినికోరుచు తీర్మానించిరి.

అమలాపురం,
ది. 30—11—52.

సి. నాగభూషణం, సెక్రటరి.
తాలూకా ఎయిడెడ్ యూనియను

## 2775 జి. వో. రద్దు

## స్వేచ్ఛగా రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషనులో చేరండి

ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ అధ్యక్షులు శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్యగారు విజయవాడనుండి ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

ప్రాథమికోపాధ్యాయుల ఏకైకసంస్థయైన ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషనులో రాష్ట్రమంతటా సభ్యులను చేర్పించుట చురుకుగా సాగిపోతుంది. అయినా అచ్చటచ్చటా విద్యాధికారులు జిల్లాబోర్డువారును ఫెడరేషనులో సభ్యులుగాచేరుటకును, మహాసభలు జరుపుటకును జి. వో 2775 తేది 24-10-51 ఉత్తరువును చూపించుతూ, అభ్యంతరాలు కలిగించుతున్నట్లు మాకు వార్తలు చేరుచున్నవి.

కాని మదరాసు విద్యాశాఖ డైరక్టరువారి ప్రొసీడింగ్సు R. C. No. 192 B 1-2-52 dated 22-10-52 ఉత్తరువులో గవర్నమెంటు మెమో No. 41111 C/50-23 dated 19-6-52 ననుసరించి "టీచర్సు యూనియన్సు రికగ్నిషనుకు సంబంధించిన 24-10-51 తేదీగల 2775 జి. వో. లో జారీచేసిన ఉత్తరువులు ప్రభుత్వం రద్దుచేసికొన్నదని క్రింది ఆఫీసర్లకు తెలియజేయడమైనది" అంటూ పంపబడినది. అందులో యింకా "యికముందు ఏ ఉపాధ్యాయ యూనియనుగాని రికగ్నైజు చేయవలసిన అవసరంలేదు యింతకు పూర్వం జిల్లా, తాలూకా టీచర్సు యూనియనులకు యివ్వబడిన రికగ్నిషనులు రద్దుఅవుతవి. కాండక్టు రూల్సుచే బంధింపబడు జిల్లాబోర్డు, మునిసిపలు టీచర్సుకూడా రికగ్నిషన్ లేని యూనియన్సులో చేరవచ్చును" అనికూడా తెలియజేయబడినది. సదరు ఉత్తరువులు చూచుకొనకనో, లేక వారివరకు చేరకనో పై అధికారులు అభ్యంతరాలు చెప్పుతూ యుండవచ్చును. గనుక దయయుంచి వారినందరను వారి అభ్యంతరాలు ఉపసంహరించుకొని మాకుతోడ్పడ గోరుచున్నాను.

యిక ప్రాథమికోపాధ్యాయులకు ఏకైకసంస్థగా ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషను దాని అనుబంధ సంఘాలు మాత్రమే యున్నవి. గత ఆరుసంవత్సరాలుగా ప్రాథమికోపాధ్యాయులు ఫెడరేషనుద్వారా పై జి. వో. ల రద్దుకొరకు పోరాటంచేసి, నేటికి విజయంపొందారు. తమ అభిమాన సంస్థయైన ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషనును ఏకైకసంస్థగా నిలుపుకొన్నారు. యికముందు సంఘాన్ని పటుతరంగా చేసికొని యింకా ఎన్నోవిజయాలు పొందవలసియుంది. గాన ఈ డిశంబరు ఆఖరులోగా విరివిగా సభ్యులుగాచేరి సంఘబలాన్ని రుజువు పరచాలని ప్రాథమికోపాధ్యాయులను కోరుచున్నాను.

ఆలస్యంగానైనా హైకోర్టుజడ్జిమెంటు గౌరవాన్ని కాపాడ, ప్రాథమికోపాధ్యాయుల కోర్కెచి మన్నించి పై జి. వో. రద్దుపరచుతూ ఉత్తరువులు పంపి ఉపాధ్యాయుల సంఘ స్వాతంత్ర్యాన్ని గుర్తించి నందులకు ప్రభుత్వమువారికి అభినందనాలు తెలుపుచున్నాను.

విజయవాడ
ది 17—11—52.

చె. లక్ష్మయ్య.
ప్రెసిడెంటు.

## శిరువెళ్ల తాలూకా ఉపాధ్యాయ కన్వెన్షన్

### తీర్మానాలు

శిరువెళ్ళ తాలూకా ఉపాధ్యాయ కన్వెన్షన్ 15-11-52 శిరువెళ్ళలో శ్రీ జి. జోకబ్ గారి అధ్యక్షతన జరిగింది. యాళ్లూరు, రుద్రవరం, శిరువెళ్ళ, ఆళ్ళగడ్డ, సెంటర్లనుండి ప్రతినిధులు హాజరయ్యారు. 4 సం॥ తరువాత తిరిగి ఈ తాలూకా ఉపాధ్యాయుల్లో నూతనోత్సాహం వెల్లివిరసింది.

ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ సహాయ కార్యదర్శి వి. విజయరామరాజు గారు సభను ఆరంభిస్తూ ఉపాధ్యాయసంఘాలు ఒక రాజకీయపక్షానికి చెందినవని స్వార్థపరులు, పెత్తందార్లు, చేసే మోసప్రచారానికి మోసపోగూడదని, జాతీయ విద్యావిధానంద్వారా 100 కి 100 మందిని విద్యావంతులుగా చేయుటయే సంఘ ఆశయమని ఉపాధ్యాయుల్లో రాజకీయాభిప్రాయులే వుండకూడదని వాదించడం వారి వ్యక్తిస్వాతంత్ర్యాన్ని బలవంతాన అరికట్టడమే అవుతుందని, చెప్తూ పోరాటద్వారా ఫెడరేషన్ ఉపాధ్యాయుల పౌరసత్వహక్కులపై సాధించిన ఘనవిజయాలు మొదలగు సంఘకృషిని వివరించిరి.

సెంటరువారీగా ప్రతినిధులు తమ సెంటర్లలో గడించిన అనుభవాలను అనుమానాలనుగూర్చి రిపోర్టులిచ్చారు చర్చలఅనంతరం ఈ క్రిందితీర్మానాలు ఏకగ్రీవంగా అంగీకరించబడినవి.

డిశంబరు ఆఖరువారంగాని, జనవరి మొదటివారంగాని, శిరువెళ్ళ గ్రామంలో శిరువెళ్ళ తాలూకా మహాసభను జరుపుటకును, ఈ లోగా ఉపాధ్యాయ సంఘసభ్యత్వం చేర్పించుట పూర్తిచేయాలని, విరాళాలు వసూలుచేయాలని, తీర్మానించడమైనది.

2. జిల్లా రాష్ట్రసంఘ ఉపాధ్యాయనాయకులను, తాలూకాలోని శాసనసభ్యులను, సభకు ఆహ్వానించుటకును తీర్మానించబడినది.

టీచర్లకు పెకమీషన్ స్కేల్సు ఇవ్వాలని IV ఫారంనుండి, కాలేజీవరకు టీచర్లపిల్లలకు ఉచిత విద్యాసౌకర్యములు కల్గించాలని, సర్టిఫికేట్లను పునరుద్ధరించాలని సమానగ్రేడ్లకు సమానస్కేల్సు ఇవ్వాలని, ప్రభుత్వాన్ని కోరుతూ కర్నూల్ జిల్లాబోర్డువారిని టీచర్లకురావలసిన ఇంక్రిమెంట్లను వెంటనే మంజూరు చేయుటకు ప్రార్థిస్తూ వృత్తిపన్ను రద్దుకోరుతూ, తీర్మానించడమైనది.

4. ఆహ్వానకమిటీ అధ్యక్షులుగా శ్రీ కె. వీరన్నగారిని, ఉపాధ్యక్షుడుగా శ్రీ డి. వెంకట్రావుగారిని ప్రధానకార్యదర్శిగా శ్రీ కె. వెంకటసుబ్బయ్యగారిని, సహాయ కార్యదర్శులుగా శ్రీ వి. జోకబ్, కె. జయరాజు గార్లను ప్రతి సెంటరునుండి ఇద్దరుచొ॥న ప్రతినిధులనుఎన్నుకొని కమిటీని నిర్మించడమైనది. స్త్రీలకు కూడా ప్రాతినిధ్య మివ్వడమైనది.

శిరువెళ్ళ,
15—11—52.

శ్రీ కె. సి. వీరన్న, సెక్రటరి.
శిరువెళ్ళ, సెంటరు.

## సిద్ధవటం తాలూకా ఉపాధ్యాయ మహాసభ

ది 2-11-52 తేదీన బోర్డుస్కూలులో యీ తాలూకా ఉపాధ్యాయమహాసభ అత్యంత జయప్రదంగా జరిగింది. జిల్లా ఉపాధ్యాయ సంఘాధ్యక్షులు శ్రీ బి. గోపాలయ్యగారు అధ్యక్షత వహించారు. రిటైర్డు డిప్యూటి కలెక్టరు శ్రీ యస్. వి. నాయుడుగారు సభను ప్రారంభించారు. అన్ని సెంటర్లనుండి ఉపాధ్యాయులు పెక్కుమంది ప్రతినిధులుగా వచ్చారు. స్థానిక సెకండరీస్కూలు టీచర్లు, ఇతరశాఖల ఉద్యోగులు వివిధ వర్గాల పురప్రముఖులు, సభనలంకరించారు. ఇంతటి మహాసభ జరగడం యీ జిల్లా ఉపాధ్యాయ చరిత్రలో నిదే ప్రథమం. జిల్లా సంఘోపాధ్యక్షులు శ్రీ యస్. సుబ్బరాయుడుగారు పంపిన సందేశం అందరిని కదలించినది. ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ టి. సుబ్బయ్యగారు సభికులకు స్వాగతం చెప్పారు. కార్యదర్శి శ్రీ బి. శ్రీరాములుగారు నివేదికను సమర్పించారు. శ్రీ యస్. వి. నాయుడుగారు ప్రారంభోపన్యాసంలో దేశాభ్యుదయ దృష్టితో భావిసంపదయైన పసిబాలురను ఉత్తమపౌరులుగా రూపొందించు

ఉపాధ్యాయులు ఐక్యతతో సంఘం స్థాపించుకోవటం ముదావహమంటూ ఉపన్యసించారు. జిల్లా సంఘ కార్యదర్శి శ్రీ వి. విజయరామరాజుగారు సంఘ ఆశయాలను విపులీకరించి, వివిధరంగాల పురోగతికి మూలమైన విద్యారంగాన్ని త్వరితగతి ముందుకు నడిపించుటకు ప్రజలు, ఉపాధ్యాయులు విద్యాధికారులు, ఐక్యం కావాలంటూ ఉత్తేజంగా నుపన్యసించారు. జిల్లా కార్యవర్గసభ్యులు శ్రీ బి. సుబ్బన్నగారు ఉపాధ్యాయుల దుస్థితులపై శ్రీ గాడిచర్ల, గవర్నరు ప్రకాశ్, విద్యామంత్రులు చెప్పిన వాక్యాల నుల్లేఖిస్తూ తన్నివారణమునకు వారు పూనుకోవాలంటూ జిల్లాబోర్డులో జరుగుచున్న లోటుపాట్లను వివరించారు. హైస్కూలు హెడ్మాష్టరు శ్రీ నరసింహారెడ్డిగారు ఆకర్షవంతమైన జీతాలులేమి, యల్. టి. టీచర్లు కఱవై విద్యావిధానం దెబ్బతింటున్నదనియు, దీన్ని ప్రభుత్వం సవరించాలనియు, మిడిచిరి. జనాబ్ మహబూబ్ సాహెబుగారు ఆదర్శవంతమైన రైల్వే – పోస్టలు సంఘాలవలె టీచర్ల సంఘం అవసరమనియు, "ఆచార్య దేవోభవ" యను వేదోక్తి నుడివి, విశిష్టమైన తమవిధ్యుక్త కర్తవ్యాలను గుర్తించి, భావిభారత భాగ్యోన్నతికి తోడ్పడవలయుననియు, సూర్యుడు బహిర్లోకాల వెలిగిస్తే మీరు మానవహృదయాలను వెలిగించి, దేశాన్నావరించిన చీకట్లను నైతిక, ధార్మిక, తాత్విక ప్రభలతో పారద్రోలి ప్రపంచశాంతికి, కల్యాణానికి పాటుపడవలయునని కరతాళధ్వనులమధ్య ఉపన్యాసం ముగించారు. హైస్కూలు టీచర్లు ఉపాధ్యాయుల హక్కులుకర్తవ్యాలను గురించి మాట్లాడారు. డిప్యూటీ ఇన్స్పెక్టరు శ్రీ కె. నాగేశంగారు సంఘాన్ని ఆశీర్వదిస్తూ ప్రసంగించారు. అధ్యక్షోపన్యాసంలో శ్రీ బి. గోపాలయ్యగారు ఉపాధ్యాయులు కేవలం జీతాలకై ఆందోళన చేస్తున్నారని భావించుట పొరపాటనియు, ప్రజానుగుణ్యమైన విద్యావిధానాన్ని సాధించుటకు కూడా సంఘాలు తీవ్రకృషి చేస్తున్నవనియు, దేశాభ్యుదయోన్నతుల గోరు సర్వ్యులుందరూ యుద్యమానికి సహకరించాలంటూ ఉపన్యసించిరి. ఏకగ్రీవంగా ఆమోదింపబడిన తీర్మానాలు:-నిర్బంధ ప్రాథమిక విద్య జయప్రదం కావాలంటే పేదవిద్యార్థులకు ఉచిత మధ్యాహ్న భోజనం పెట్టాలని, విదేశాల విద్యావిధానాన్ని పరిశీలించి యీ దేశాని కనుగుణ్యంగా రూపొందించుటకై ప్రజల, ఉపాధ్యాయుల, ప్రభుత్వ ప్రతినిధులను ప్రభుత్వ ఖర్చులతో విదేశాలకు పంపాలని, ట్రైనింగు విద్యార్థులకు పూర్తి జీతాన్ని స్టైపెండుగాయివ్వాలని రద్దుచేయబడిన సర్టిఫికెట్లను వెంటనే పునరుద్ధరించాలని, S. S. L. C పూర్తిచేసిన హైయర్ టీచర్ల సర్టిఫికెట్లను సెకండరీగ్రేడు సర్టిఫికెట్లుగా మార్చాలని ఉపాధ్యాయులకు కూడా రు 200 లకు మించని అప్పులను యివ్వాలని, ఇతర ఉద్యోగులకువలె యింటిబాడుగ ఇవ్వాలని, ఎయిడెడ్ పాఠశాలలలో టీచర్లకు మేనేజర్లు నెల 1కి యిచ్చే రు 3-0-0 ప్రభుత్వంవారే యివ్వాలని, మఱియు ననేక తీర్మానములు ఆమోదింపబడెను.

జాతీయగీతంతో సభముగిసిన తర్వాత వాద్య విశేషాలతో; ఉపాధ్యాయుల కోర్కెలు తెలిపే నినాదాలతో, పురవీధులలో ఊరేగింపు జరిగెను. వచ్చిన టీచర్లకు విడిది భోజనసౌకర్యములను శ్రీ బి. శ్రీరాములు కార్యదర్శిగారు విచారించిరి.

ఇట్లు

సిద్ధవటం,
ది 5—11—52.

బి. శ్రీరాములు, కార్యదర్శి
తాలూకా ఉపాధ్యాయసంఘం.

---

# శ్రీమదాంధ్ర మహాభారతము

(పద్యకావ్యము - కవిత్రయ ప్రణీతము)

| పండిత పరిశోధితము | | (క్యాలికో బైండు) |
|---|---|---|
| విడి సంపుటము 1 కి | ... | 4—0—0 |
| పూర్తి ప్రతి 7 సంపుటములలో | ... | 28—0—0 |
| ,, 3 సంపుటములలో | ... | 26—0—0 |

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

(పద్యకావ్యము - పోతనామాత్య ప్రణీతము)

| పండిత పరిశోధితము | | (క్యాలికో బైండు) |
|---|---|---|
| సంపూర్ణ ప్రతి—ఒకే సంపుటము | ... | 12—0—0 |
| ,, —రెండు సంపుటములు | ... | 14—0—0 |
| ,, —మూడు సంపుటములు | ... | 16—0—0 |

**భర్తృహరి సుభాషితము** (క్యాలికో బైండు) 4—0—0

**శ్రీకృష్ణ కర్ణామృతము** (క్యాలికో బైండు) 3—0—0

**శ్రీరామ కర్ణామృతము** (క్యాలికో బైండు) 2—8—0

# శ్రీమద్భగవద్గీత (పండిత పరిశోధితము)

| | | |
|---|---|---|
| ఆంధ్ర తాత్పర్యసహితము క్యాలికోబైండు | ... | 2—0—0 |
| ,, రేపరు బైండు | ... | 1—8—0 |
| మూలం రేపరు | ... | 0—6—0 |
| ఆంధ్ర వచనము చిన్నసైజు | ... | 0—8—0 |

**భాస్కర రామాయణము** - పద్యకావ్యం (అచ్చులో నున్నది)

ప్రకాశకులు:

**రామా అండ్ కో., (H. O.) ఏలూరు.**

బ్రాంచీలు: గుంటూరు – రాజమండ్రి – భీమవరము – తెనాలి – విజయనగరము

ANDHRA RASTRA PRARAMPHA VIDYA
Regd. M.N. 3766 Vol. 41. - No. 9




## 15-12-1952 నుండి 14-1-1953 వరకు

మేషం—ధనలాభం-శత్రుజయం-కార్యసాఫల్యం-చంచలమనోవృత్తి-వైరాగ్యము.
వృషభం—శుభమంగళకవ్యయం-సర్వత్రవిజయాభివృద్ధి-బంధుజనాగమం-పారితోషికప్రాప్తి.
మిథునం—ఉపాసనాప్రవృత్తి-ధనలాభం-మహాజనమైత్రి-గ్రంథరచన-పరిశోధన-నూతనవస్త్రాదిలాభం.
కర్కాటకం—అర్థనష్టము-మనోవ్యాకులత-చోరాదిపీడ-లాభనష్టములు-ప్రభుక్రోధం.
సింహం—శారీరక-అంతర్నాడీపీడ-ధనవ్యయము-కించిత్కార్యచిత్కలాభం-చంచలహేయమనోవ్యాపారం.
కన్య—లాభనష్టములు-చోరబాధ-శత్రువృద్ధి-యథాదాయవ్యయములు-శుభలాభప్రయాణం
తుల—మనోవ్యాధి-లౌకికవ్యావహారికద్రవ్యనష్టం-శుభలాభములు-విద్యాగోష్ఠి.
వృశ్చికం—విక్రమచాకచక్యప్రవృత్తి-విద్యాగోష్ఠి-దూరస్థితి-పారమార్థికచింత-సత్యప్రవృత్తి-భూతదయ - జనమైత్రి.
ధనుస్సు—శుభాభివృద్ధి-గృహకల్యాణములు-శరీరశ్రమ-మానసాందోళన.
మకరం—కుటుంబవిషయకచింత-నూతనాలంకారప్రాప్తి-విక్రమధైర్యస్థితి-ధనాదాయసూచన.
కుంభం—దూరప్రయాణం-శత్రుబాధ-జననింద-యాదృచ్ఛికలాభము-ధనాగమకార్యకరణం.
మీనం—ధనధాన్యలాభం-కార్యవిఘ్నము-జనవిరోధము-దైవచింతన-ఈశ్వరపూజలు.

మీ మీ జాతక కుండలిని అనుసరించి మీగోచారఫలాలు పరిణామము చెందుచుండును.

(ఈ సంవత్సరములో కార్తీకపౌర్ణమి - అశ్వినీ నక్షత్రముతో కలియుటవల్ల అక్కడక్కడ దేశములో ధూమకేతుసందర్శనము - గొప్పవారికి (ప్రభుజన) పీడలు - మరణపరిస్థితులు - నదీప్రవాహములు-నదులు పొంగుట - వ్యవసాయనష్టములు -జననాశము- మొత్తముమీద నవంబరు మొదలు ఈ 1953 మార్చి వరకు ప్రభువులకు, ప్రజలకు విరోధాలేకాక యుద్ధప్రయత్నములుగూడ జరిగి ఎక్కువ అశాంతి యేర్పడు సూచనలు గనబడుచున్నవి.)

☞ సిద్ధయోగినీ, నాడీజ్యోతిష శాస్త్రరీత్యా జాతక, ముహూర్త, వాస్తు, ప్రశ్న విషయములు, గ్రహపీడాది సర్వబాధలకు చికిత్సలు, మళయాళ, మహాకాళీ, కుట్టీ, యామిళయోగినీ, కవచ, యంత్ర రాజసందర్భములు, సరసముగా తెలుపబడును.

వలయువారు నిలయము పేర వ్రాయవలెను.

దైవజ్ఞభూషణ, భిషగ్రత్న, : పండిత డి. యస్. యన్. శాస్త్రి,
శ్రీ శివనాడీ జ్యోతిర్నిలయము, పవరుపేట - ఏలూరు. (పశ్చిమగోదావరిజిల్లా)

Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published
by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.